# సంపాదకీయం

సరస్వతీ ప్రార్థన చేయటం మత ఛాందసానికి ప్రతీకమని, జాతీయగీతమున 'వందేమాతరం' గీతాలాపన చేయటం సెక్యూలర్ విధానాలకు వ్యతిరేకమని, 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' గేయం ఆలాపించడం సంకుచితమని, శ్రీ సత్యసాయిబాబా వారికి ప్రధానమంత్రి, ముఖ్యమంత్రి పాదాభివందనం చేయటం ప్రజాస్వామ్య విరుద్ధమని కొందరు వాదిస్తున్నారు, విమర్శిస్తున్నారు.

ఇట్టి విమర్శలు చేసే వారిలో చాలా మంది శంకుస్థాపనలకు, ప్రారంభోత్సవాలకు వెళ్ళి కొబ్బరికాయలు కొడుతూనే ఉంటారు. సరస్వతీ పేర్లను పెట్టుకుంటూనే ఉంటారు, ఇంటిదగ్గర సరస్వతిని ఆరాధిస్తూనే ఉంటారు. కాని బయట మాత్రం సరస్వతీ ప్రార్థన మత ఛాందసానికి ప్రతీకమని వాదిస్తుంటారు. సరస్వతి ఒక మతానికి చెందిన దేవత కాదు. ఈమె చదువుల తల్లి. ఆమె విద్యాదేవత. విద్యారంభానికి ముందు సరస్వతిని ఆరాధించి బాలబాలికలకు అక్షరాభ్యాసం చేయించడం భారతీయ సంస్కృతీ సంప్రదాయానికి చిహ్నం. అంతేగాని ఆ చదువుల తల్లిని ఒక మతానికి చెందిన దేవతగా వక్రీకరించడం సంకుచితత్వమే అవుతుంది.

ఇకపోతే స్వాతంత్ర్య సమర సంగ్రామంలో ముఖ్యంగా భారతీయ యువతకు స్ఫూర్తిని, శక్తిని ప్రసాదించిన దేశభక్తి గేయం 'వందేమాతరం'. ఆ స్ఫూర్తితో కదం త్రొక్కింది ఈ భరతజాతి. రవి అస్తమించని బ్రిటీష్ సామ్రాజ్యాన్ని కూకటివేళ్ళతో పెకలించి వేయగలిగింది. ఆనాడు జిన్నావంటి కరడుగట్టిన ముస్లీం-నేతలు సహితం ఈ గీతానికి ఎట్టి అభ్యంతరం చెప్పలేదు. అయితే ఈనాడు అనగా స్వతంత్రభారతికి స్వర్ణోత్సవ హారతిపట్టి వీడ్కోలు పలికిన తరువాత, ఈ జాతీయగీతాన్ని ఆలపించడం సెక్యులర్ భావాలకు వ్యతిరేకమని వాదించడం శోచనీయం, దురదృష్టకరం.

యావత్ ప్రపంచంలో 'వందేమాతరం' గీతం స్వాతంత్ర్య సమరయోధులకు ఎటువంటిఉత్సాహాన్ని, ప్రోత్సాహాన్ని ఇచ్చిందో తెలుగునాట 'మాతెలుగు తల్లికి మల్లెపూదండ' గేయం వాడవాడ, గ్రామగ్రామాన అంతటి స్ఫూర్తిని, శక్తిని ఇచ్చింది. అయితే ఈనాడు స్వతంత్ర్య భారతంలో ఇటువంటి దేశభక్తిని ప్రభోదించే గేయాలను ఆలాపన చేయటం సెక్యులర్ విధానాలకు వ్యతిరేకమని కొందరు పెద్దలనబడేవారు వాదించడం శోచనీయం, విచారకరం.

ఈ మధ్య పుట్టపర్తి వెళ్ళిన ప్రధానమంత్రి వాజ్‌పేయి, ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు శ్రీసత్యసాయిబాబావారికి పాదాభివందనం చేయటంపట్ల కొందరు విమర్శిస్తున్నారు, అది ప్రజాస్వామ్య సంప్రదాయాలకు విరుద్ధమని ప్రకటనలు చేస్తున్నారు. ఇటువంటి ప్రకటనలు చేసేవారికి ఏ మాత్రం భారతీయ సంస్కృతీ సంప్రదాయాల యెడల విశ్వాసం, గౌరవం లేదనే చెప్పవచ్చును. గత-చరిత్రను ఒకపర్యాయం సింహావలోకనం చేసుకుంటే 'ఢిల్లీకి రాజు అయినా, తల్లికి కొడుకే గదా!' అనే విషయం జ్ఞప్తికి రాక మానదు. శ్రీరామచంద్రునిలాంటివాడు తన గురువైన వశిష్ఠునికి సాష్టాంగ నమస్కారం చేశాడు. శ్రీకృష్ణ పరమాత్మ తన గురువైన సాందీపునికి పాదాభివందనం చేశాడు. చంద్రగుప్తుడు చాణుక్యునికి ప్రణమిల్లాడు. సమర్థరామదాసుకు శివాజి సాష్టాంగ నమస్కారం చేశాడు. తిమ్మరుసుకు శ్రీకృష్ణదేవరాయలు పాదాభివందనం చేశాడు. అలనాటి రష్యా ప్రధాని గోర్బచెవ్, ప్రత్యేకంగా రోమ్‌కు వెళ్ళి పోప్‌కు ప్రణమిల్లి వచ్చాడు. ఇటలీమాజీ ప్రధాని క్రాక్సీ (ప్రధానమంత్రిగా ఉన్నప్పుడే) పుట్టపర్తి వచ్చి భగవాన్ బాబావారికి పాదాభివందనం చేశాడు. తల్లిదండ్రులకు కొడుకులు పాదాభివందనం చేయటం, గురువుల్లకు శిష్యులు సాష్టాంగ నమస్కారం చేయటం భారతీయ సంస్కృతి, సంప్రదాయం మఠాధిపతులకు, పీఠాధిపతులకు, ఆధ్యాత్మికతత్త్వ వేత్తలకు పాదాభివందనం చేయటం అనాదిగా వస్తున్న మన సత్సంప్రదాయం. పెద్దలను గౌరవించడం, సర్వసంగపరిత్యాగులను ఆరాధించడం, పూజించడంలో ఏ మాత్రం తప్పులేదు. పైపెచ్చు అలాగే గౌరవించేవారి ప్రతిష్ఠ ఇనుమడిస్తుందేగాని ఏమాత్రం తరగదు.

చౌకబారువిమర్శనలకు తావివ్వకుండా, విశిష్టమైన భారతీయ సంస్కృతీ సంప్రదాయాలను మన్నించి, గౌరవించి, ఆచరించడం సముచితం, సత్సంప్రదాయం. అది భావితరాల వారికి మార్గదర్శకం.

(కొమరగిరి కృష్ణమోహనరావు)

డిసెంబర్ 1998

సంపుటి 14 సంచిక 12





సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు



మేనేజర్
**కొమరగిరి చంద్రశేఖర్**
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
✆ 22818, 21137



Cheques & Drafts should be drawn in favour of *"SREEVANI"* Monthly Machilipatnam

Edited, Printed and Published by ***Komaragiri Krishna Mohan Rao***


| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్‌సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |


*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**9 - 12 -1998**


## విషయసూచిక


| | | |
|---|---|---|
| అమృతవాణి | కూచిభట్ల చంద్రశేఖర శర్మ | 2 |
| పద్మభూషణ్, కవి సామ్రాట్ శ్రీ విశ్వనాథ | డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు | 3 |
| కలిసిమెలసి పనిచేయండి కలత లేక చెలిమితో జీవించండి | భగవాన్ సాయి దివ్యబోధ | 5 |
| అర్చన - అర్పణ | పంచాంగం శీనప్ప శాస్త్రి | 6 |
| రసవద్ఘట్టాలు - 42 | జానమద్ది హనుమచ్ఛాస్త్రి | 11 |
| మనోభిరామం - 34 | సోమంచి రామం | 12 |
| హెల్త్, వెల్త్ తల్లిదండ్రుల ఆశీర్వాద ఫలితమే | భగవాన్ సాయి సందేశము | 13 |
| సరస్వతీ ప్రార్థన అభ్యంతరకరమా? | మన్నవ గిరిధరరావు | 15 |
| స్నాతకోత్సవ సందేశం | భగవాన్ సాయి దివ్య ప్రకటన | 16 |
| జ్యోతిర్లింగాలు-2 | శ్రీ జోస్యుల రామచంద్రశర్మ | 21 |
| జన్మదినోత్సవ సందేశం | భగవాన్ సాయి దివ్యబోధ | 22 |
| నాకు ప్రేమను ఇచ్చుకోండి! నా నుండి సర్వమునూ పుచ్చుకోండి! | భగవాన్ సాయి దివ్యబోధ | 27 |


ముఖచిత్రం :

 **శ్రీ విశ్వనాథ సత్యనారాయణ** 

# అమృతవాణి

శ్లో॥ స్వకీయ విణ్మూత్ర నిమజ్జనంత
చ్ఛేత్తానగత్యా శయనం తదాయత్
బాలగ్రహాద్యాహతి భాక్చ శైశవం
విచార్య కోవా విరతిం నయాతి॥

బాల్యంలో, లోకమెరుగని వయసులో, మనిషి తన మూత్ర పురీషాల్లోనే మునిగి తేలుతూంటాడు. ఇటు అటు కదలలేక వెల్లకిలా పడుకొంటాడు. బాలగ్రహాదుల పీడ అనుభవిస్తూండటం జరుగుతుంది. ఇలాంటి శైశవ దశను గురించి ఆలోచించినప్పుడు అతనికి వైరాగ్యం కలగకుండా ఉంటుందా?

నిజాన్ని సూటిగా తెలుసుకుంటే ఎంతటి వాడికైనా వైరాగ్యం కలగక తప్పదు అనిపిస్తుంది. లోకంలో రోజూ మనం పసిపిల్లలను చూస్తున్నాం. మనింట్లో పుట్టిన పిల్లల్నీ చూస్తున్నాం. వాళ్ళ పరిస్థితి ఏమిటి? వాళ్ళు గర్భంలో ఉన్నప్పుడేకాక పుట్టిన తర్వాత కూడ మలమూత్రాల్లో కొట్టుకుంటుంటారు. చూచేవాళ్ళకు చాలా అసహ్యంగా ఉంటుంది. నోట్లో ఏం పెట్టుకోకూడదో కూడా తెలీక ప్రవర్తిస్తారు. ఒక్కసారి అది చూచినవాడు తన బాల్యం కూడా ఆలోచించుకోకుండా ఉంటాడా. అది ఆలోచనలో మెదలితే వాడికెంత అసహ్యాభావం కలుగుతుందంటారు?

పసిపిల్లవాడు ఎప్పుడూ వెల్లకిలా పడుకొని ఉంటాడు. ఆకలిదప్పికల్ని చెప్పలేక ఊరకే ఏడుస్తూంటాడు. దోమలు, చీమలు,నల్లులు మొదలైనవి కుట్టినా నోరులేని వాడు కదా! గర్భయాతన తర్వాత ఇదొక యాతన అనుభవించాల్సిందే!

ఇది ఇలా ఉండగా పసితనంలో వచ్చే రోగాలిన్నీ అన్నీకాదు. తల్లి పొరపాటున అపథ్యం చేస్తే దాని ఫలితం పసివాడనుభవించాలి. బాలగ్రహాలనేకం పిల్లల్ని ఆసించి పాలు త్రాగనీయవు. ఆహారం తిననీయవు. అప్పుడు మంత్రాలు తంత్రాలు అంటూ బయలుదేరాలి. ఆ పసిపిల్లవాడి కడుపులో బాధ ఏమిటో ఒక పట్టాన అర్థంకాదు. వైద్యుల వద్దకు వెళ్ళి మందులు మాకులు చూడటం. గ్రహబాధ తొలగటానికి జాతకరీత్యా గ్రహశాంతులు చేయించటం ఇదీవరస. వాతపిత్తశ్లేష్మాల ప్రకోపంవల్ల వచ్చే వ్యాధులనంతంగా ఉంటాయి. వీటన్నింటికి చాలా ధనం వెచ్చించాలి. శారీరక శ్రమ పడాలి. మానసిక వ్యధ అనుభవించాలి.

**కూచిభట్ల చంద్రశేఖరశర్మ**

ఇప్పుడు తత్త్వదృష్టితో ఆలోచనచేస్తే ఎదుట పసివాడుపడే అసహ్య పరిస్థితి, బాధలు చూడటం, మనం బాధపడటం ఎలాగో తప్పదు. బాబోయ్ యీ బాధలు పరాయి వాడికి కూడా వద్దు అంటూ అనుకోవడం తప్పదు. అంతేకాక తన బాల్యం గుర్తుకొస్తే ఇప్పుడు చూస్తున్న అసహ్యావేదన తానూ అనుభవించాననుకొంటాడుకదా! ఈ బాలారిష్టాదులు, యాతనలు తల్చుకొన్నప్పుడైనా ఛీఛీ ఈ జన్మ అని వైరాగ్యం కలగకుండా ఉంటుందా? బుద్ధిమంతునికి తప్పక వైరాగ్యం కలిగి తీరాలి. అది నిజమైన జ్ఞానానికి ఫలితమౌతుంది.

పచ్చి నిజం తెలిసినా వైరాగ్యభావం కలగకపోతే మాయావరణం తొలగలేదని అర్థం. అజ్ఞానం చిక్కగా పేరుకున్నదని అర్థం. ◎

# పద్మభూషణ్, కవి సామ్రాట్
# శ్రీ విశ్వనాథ

ఒక్క సంగీతమేదో పాడునట్లు భా
షించు నప్పుడు వినిపించు భాష
విస్పష్టముగ నెల్లవినిపించునట్లు స్ప
ష్టోచ్చారణంబున నొనరు భాష,
రసభావముల సమర్పణ శక్తియందున
నమర భాషకును దీటైన భాష,
జీవులలోనున్న చేవయంతయు చమ
త్కృతి పల్కులన్ సమర్పించు భాష,
భాషలొక పదితెలిసిన ప్రభువుచూచి
భాషయన నిద్దియని చెప్పఁబడిన భాష
తనర ఛందస్సులోని యందమ్ము నడక
తీర్చి చూపించినట్టిది తెలుఁగు భాష

అంటూ ఆధునికాంధ్రకవితా సామ్రాజ్యాన్ని సర్వజన మనోరంజకంగా పాలించిన మహావ్యక్తి, అద్భుతశక్తి శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు. ఆయన చేపట్టని సాహిత్య ప్రక్రియలేదు. మహాకావ్యము, ప్రబంధ కావ్యములు, ఖండ కావ్యములు, గేయ కావ్యములు, నాటకములు, నవలలు, కధానికలు, విమర్శలు - ఎన్నెన్నో వారి లేఖిని నుండి అమృతఝురిలా జాలువారినాయి. 'వేయి పడగలు'వంటి మహాగ్రంధాన్ని నవలగా రచించినా, లెక్కకు మిక్కిలిగా మరెన్నో నవలలను నాటకములను రచించినా "కవి సామ్రాట్ "గానే ఆయన తెలుగు వారి గుండెల్లో కలకాలం కాపురం ఉంటారు. "నేను పద్యములు వ్రాయుదునన్నమాటలోక వార్తయైపోయెను. పండితులు కొందరికి నేను వ్రాయునట్టి పద్యములు నచ్చవట. వాటి యందు కించిదర్థమైన గోచరించదట. దానికేమి సేయంగవలె" 'అంటూ' "ఎవడయిన నన్ను పద్యాలు వ్రాయమంచు అడుగుటది. నాకు గిలిగింతపెట్టినట్లు, అందుచే నేదొ యొకటి వ్రాయకయుపోను" అని పద్యరచన యందు తమ కున్న మక్కువను ప్రకటిస్తారు. విశ్వనాథవారి సాహితీ ప్రస్థానాన్ని గురించి ముచ్చటించుకునే ముందు వారి జీవిత విశేషాలను గురించి కూడా జ్ఞాపకం చేసుకోవటం ఎంతయినా అవసరం!

కళాప్రపూర్ణ, కవిసామ్రాట్, పద్మభూషణ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి జన్మస్థలం కృష్ణాజిల్లాలోని గుడివాడ సమీపాన గల నందమూరు. వారి పితృపాదులు శ్రీ శోభనాద్రిగారు గొప్ప వదాన్యశిరోమణి. శ్రీ సత్య నారాయణగారి విద్యాభ్యాసము బందరు పట్టణంలోనే జరిగింది. సహాయ నిరాకరణోద్యమం కారణంగా వారు బి.ఎ. పూర్తికాకుండానే చదువు చాలించి బందరు జాతీయ కళాశాలలో ఉపాధ్యాయులుగా చేరారు. తరువాత బి.ఎ, యం.ఎ. పరీక్షలలో ఉత్తీర్ణతనొంది ముందుగా బందరు హిందూ కళాశాలలోనూ, ఆ తర్వాత గుంటూరు ఆంధ్రా క్రిస్టియన్ కళాశాలలోనూ ఆంధ్రోపన్యాసకులుగా పని చేశారు. 1933వ సంవత్సరంలో వారికి ప్రథమ భార్యావియోగం కలిగింది. అప్పుడు వారు మళ్ళీ బందరు వచ్చి రచనా వ్యాసంగాన్ని కొనసాగించారు. 1938వ సంవత్సరంలో మళ్ళీ విజయవాడ

**డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు**

కళాశాలలో ఉపన్యాసకులుగా చేరారు. 1960వ సం॥లో శాసనమండలి సభ్యులైనారు. తర్వాత కరీంనగర్ కళాశాల ప్రిన్సిపాల్‌గా కొన్నాళ్ళు పని చేశారు. ఆ తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ఆస్థానకవిగా చాలాకాలం ఉన్నారు. "విశ్వనాథ మధ్యాక్కరలు" అనే వారి గ్రంధానికి కేంద్ర సాహిత్య అకాడమీ బహుమానం లభించింది. "శ్రీమద్రామాయణ కల్పవృక్షాని"కి జ్ఞానపీఠంవారు లక్షరూపాయల పారితోషికాన్నిచ్చారు. ఆంధ్ర విశ్వవిద్యాలయం వారికి 'కళాప్రపూర్ణ' బిరుదును, కేంద్ర ప్రభుత్వం 'పద్మభూషణ్' బిరుదును, శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయం 'డాక్టరు' పట్టాను ఇచ్చి ఆయనను గౌరవించాయి. 1976వ సంవత్సరం సెప్టెంబర్ 18వ తేదీన వారికి 'సహస్రమాస చంద్రదర్శన మహోత్సవం' జరిగింది. 1976వ సంవత్సరం అక్టోబరు 18వ తేదీన శ్రీ విశ్వనాథవారు కీర్తిశేషులైనారు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు శ్రీ కంభం పాటి రామమూర్తి శాస్త్రిగారి వద్ద సంస్కృత వ్యాకరణమును, శ్రీ పరిమి నరసింహశాస్త్రిగారి దగ్గర సూత్రభాష్యమును, శ్రీకానుకొలను త్రివిక్రమగారి వద్ద వేదాంత ప్రకరణములను అభ్యసించారు. శ్రీ కళ్యాణానంద భారతీమాతాచార్యుల వద్ద ఉపనిషద్భాష్యములను పఠించారు. బందరులో చదువుకునే రోజుల్లో శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రి గారి శిష్యరికం చేశారు. ఆంధ్ర కవులలో శిల్పం దృష్ట్యా నన్నయ, తిక్కన, నాచన సోమన, పెద్దన శైలి దృష్ట్యా తెనాలి రామకృష్ణుడు, కృష్ణరాయుడు, నాచన సోమన, పెద్దన మొదలైనవారు వారికి మేలిబంతులు. ప్రతిభ, వ్యుత్పత్తి,

అభ్యాసములను మూడు కావ్యహేతువులను పుష్కలముగా గల్గినవారు శ్రీ విశ్వనాథ.

విశ్వనాథవారు గ్రంథములను రచించిన పద్ధతి వింతగా అన్పిస్తుంది. ఏ పుస్తకమును వ్రాయటానికైనా ఆయనకు వారం, పదిరోజులు కంటె ఎక్కువ కాలం పట్టదు. తమ సోదరులు వేంకటేశ్వరులుగారు వ్రాయగా అదేపనిగా చెప్తూ నెలరోజుల్లో ఆయన "వేయి పడగలు" నవలను రచించారు. ఆయన కలం నుండి జాలువారిన ఆణి ముత్యాలు అన్నీ ఇన్నీ కావు. ఆయన రచించిన "శ్రీ మద్రామాయణ కల్పవృక్షం" అసమానం! అద్వితీయం! పూర్వ కవులు రచించిన రామాయణాలు అనేకం ఉండగా మళ్ళీ ఈ రామాయణం ఎందుకు" అని తనకు తానే ఎవరో ప్రశ్నించునట్లు భావించుకుని -

**మరలనిదేల రామాయణం బన్నచో**
**వీ ప్రపంచకమెల్లనెల్ల వేళ**
**దినుచున్నయన్నమేతినుచున్న దిన్నాళ్ళు**
**తనరుచి బ్రతుకులు తనవిగాన**
**చేసిన సంసారమే చేయుచున్నది**
**తనదైన యనుభూతి తనదిగాన**
**తలచిన రామునే తలంచెద నేనును**
**నా భక్తి రచనలు నావిగాన**

అంటారు. శ్రీ విశ్వనాథవారు వ్రాసిన పద్యకావ్యాలు ఝాన్సీ రాణి, భ్రష్టయోగి, భ్రమరగీతాలు, శృంగార వీధి మొదలైనవి. లఘు కావ్యాలలో శ్రీ కృష్ణ సంగీతము, గిరికుమారుని ప్రేమ గీతాలు, శశిదూతము, వరలక్ష్మి త్రిశతి, ధర్మపత్ని చెప్పుకోదగ్గవి. విశ్వనాథవారి "విశ్వనాథ పంచశతి" ఐదువందల పద్యముల ముక్తకకృతి. ఇది గాథా సప్తశతి వంటిది. నాటకములలో 'గుప్తపాశుపతము,'నర్తనశాల, అనార్కలి ప్రముఖమైనవి. నవలల్లో అంతరాత్మ, బాణావతి, పులిమ్రుగ్గు, చెలియలికట్ట, కడిమి చెట్టు, స్నేహ ఫలము, ధర్మ చక్రము, భగవంతుని మీద పగ, వీరపూజ, బద్దన్నసేనాని, హాహాహూహూ, ఏకవీర చెప్పుకోదగ్గవి. కాశ్మీరరాజవంశపు నవలల్లో భ్రమర వాసిని, మిహిరకులుడు, కవలలు, యశోవతి, పాతిపెట్టిన నాణెములు, సంజీవకరణి చెప్పుకోదగ్గవి. ఇవికాక పురాణవైర గ్రంథమాల అనే పేరుతోవారు రచించిన నవలలు హాసీనా, నాగసేనుడు, వేదవతి, నివేదిత, అమృతవల్లి, అశ్వమేధము, చంద్రగుప్తుని స్వప్నము, నందోరాజా భవిష్యతి, నాస్తిక ధూమము, ధూమరేఖ మొదలైనవి. అలాగే నేపాళ రాజవంశ నవలలుగా శ్రీ విశ్వనాథవారు దంతపుదువ్వెన, దిండు క్రింద పోకచెక్క, చిట్లీచిట్లని గాజులు, లలితా పట్టణపు రాణి, దూత మేఘము, సౌదామిని మొదలైన రచనలు చేశారు.

"విష్ణుశర్మ ఇంగ్లీషు చదువులో" ఆంగ్ల వ్యాకరణం మీద శ్రీ విశ్వనాథవారికున్న పట్టు స్పష్టమవుతుంది. ఇది వినోద ప్రధానమైన నవల.

ఆధునికాంధ్ర గేయ వాఙ్మయములో శ్రీ విశ్వనాథ వారి "కిన్నెరసాని పాటలు"కు ఒక విశిష్టమైన స్థానమున్నది. కిన్నెర ఉద్విగ్నహృదయ! అత్తపోరుపడలేక కౌగిలించిన భర్త కౌగిటిలోనే కరగినీరై వాగుగా ప్రవహించినది. అక్కడి నుండి కిన్నెర నడకలు, నృత్యము, సంగీతము, కడలిపొంగు కిన్నెర దుఃఖము, గోదావరి సంగమముగా ఆమె జీవితం నడుస్తుంది. కిన్నెర నృత్యాన్ని విశ్వనాథవారు ఎంత రమణీయంగా చిత్రించారో గమనించండి. 'కెరటాలలో, నురుసుతెరచాలులో, కిన్నెరటుకదలి యిటుకదలి, చిటి తరంగాలతో, పోటి తరంగాలతో నటనలు మొదలెట్టెనే! క్రొన్నీటి తుడుములా కదలాడెనే!' "పాముపాట" అనే సంగీత రూపకం శ్రీ విశ్వనాథ వారి మరో అపూర్వ సృష్టి! పాముతో పెండ్లి అయిన త్రైలోక్య సుందరి పతి భక్తి బహుధా ప్రశంసనీయం! "ఎన్నెన్ని క్షేత్రమ్ములేగితినో యీవఙకు, చిన్ని నా స్వామికి చిలువ రూపముపోదు బుట్టలోపల స్వామి బుసకొట్టుచున్నాడు. అట్టి యాకలివేయునను కొందు నీయనకు, ఏయింటనైన పాలిప్పించు డని నేను పోయితప్పక యడగబోయి, యీ పాటికిని బుట్టదింపితి గాలిపోసుకోవయ్యా! బెట్టుసేయక పడగ విప్పిలేవయ్యా" అంటూ ఆమె పతియందు చూపె అనురాగం పాఠకుల కంటతడి పెట్టిస్తుంది.

విశ్వనాథ వారిని కొందరు సంప్రదాయవాది అనీ, ఫ్యూడల్ వ్యవస్థను సమర్ధించారనీ అన్నారు. దానికి వారు సమాధానం చెపుతూ, "If people say that I have no sympathy for modernism. I can only pity them. I am not enemy of science and technology.... My ideal briefly stated is socialism plus God plus Religion. I may be defender of lost causes. But I think, it is better to doing firmly to something that is better. To doing firmly to something that is with in our reach than chase desperately that shall never be ours" అంటారు.

విశ్వనాథవారి కవితాత్మను, కవితావైదుష్యాన్ని, సాహిత్య సౌందర్య దర్శనమును గురించి చర్చించాలంటే ఇది సందర్భంకాదు. ఎందుకంటే ఆ చర్చకు అక్షరరూపం కల్పించాలంటే ఒక మహోద్గ్రంథం అవుతుంది! భక్తి శ్రద్ధలతో సంభ్రమాశ్చర్యాలతో ఆయనకు అంజలి ఘటించడమే మనం ఈ క్షణాన నిర్వర్తించవలసిన కర్తవ్యం! మన సాహిత్య అధ్యయనానికి కావాలి అదే గమ్యం. 

# కలిసి మెలిసి పనిచేయండి! కలత లేక చెలిమితో జీవించండి!

ప్రేమస్వరూపులారా!

"శరీరమాద్యం ఖలు ధర్మ సాధకమ్" ఈ శరీరం ధర్మాచరణ నిమిత్తమై అందించిన వరప్రసాదం. కనుక ఈ శరీరమును పవిత్రమైన కర్మలచేత పవిత్రం గావించుకోవాలి. ఈ శరీరమునకు ఆరోగ్యం అత్యవసరం. మానవ జీవితమునకు ఆరోగ్యం పునాదివంటిది. ఈ ఆరోగ్యమును కోల్పోయిన యెడల మనం అనేకవిధములైన బాధలకు గురికావల్సివస్తుంది. మానవజీవితంలో ఆరోగ్యమునకు మించిన మహాభాగ్యం మరొకటి లేదు. అన్ని అంగముల చేరికే ఈ శరీరము. కనుక పరిపూర్ణమైనటువంటి ఈ శరీరమును పవిత్రమైన మార్గంలో ప్రవేశపెట్టాలి. ప్రతి అంగమును పవిత్రమైన కార్యములో ప్రవేశపెట్టాలి. అప్పుడే ఈ శరీరము పుష్టి, సంతుష్టిని అందుకుంటుంది. శరీరము ఆరోగ్యముగా లేకుండిన మనసు ఆరోగ్యంగా, ప్రశాంతంగా ఉండదు. ఆరోగ్యమైన దేహము నందే ఆరోగ్యమైన మనసుకూడా ఉంటుంది. ఆరోగ్య శరీర మనసుల యొక్క పరిస్థితిని పురస్కరించు కొనియే ఆత్మ తనవ్యక్తిత్వాన్ని పోషించుకుంటుంది. కనుక మానవ శరీరము సర్వ ధర్మములకు, సర్వకర్మలకు మూలాధారం. 'ధర్మ అర్ధ కామమోక్షాణాం ఆరోగ్యం మూలముత్తమమ్'ధర్మ అర్ధకామమోక్షములనే పురుషార్ధములకు కూడా ఆరోగ్యమే ప్రధానమైన పునాది. కనుక నైతిక, ధార్మిక, ఆధ్యాత్మిక లౌకిక మార్గములలో ఈ శరీరమును ప్రవేశ పెట్టటానికి ముందుగా ఆరోగ్యమును కాపాడుకోవాలి.

అసలు ఈ ఆరోగ్యము చెడటానికి మూల కారణములను మనం విచారించాలి. అమితమైన ఆలోచనల చేతనూ, అమితమైన చింతలచేతనూ, అమితమైన చదువుల చేతనూ - ఈ ఆరోగ్యమును మనం కోల్పోతున్నాం. అధికంగా చదవటంచేతనూ ఆరోగ్యం దెబ్బతింటుంది. ప్రతిదానికి ఒకనియమం ఉంటుండాలి. ప్రతికర్మకూ ఒక పరిమితం ఉంటుండాలి.

గ్రీసు వేదాంతి అరిస్టాటిల్ జీర్ణకోశము మీద అనేక పరిశోధనలు చేస్తూ వచ్చాడు. నిరంతర పరిశోధనల చేత, కట్టకడపటికి అతనికి కూడా అనారోగ్యం ఏర్పడి, అజీర్ణ వ్యాధికి గురియై మరణించాడు. అదే విధముగనే 'ఫెరిన్' అనే డాక్టర్ గుండెజబ్బుల మీద అనేక పరిశోధనలు చేస్తూ వచ్చాడు. కట్టకడపటికి గుండె వ్యాధి తోనే అతను మరణించాడు. కనుక మనం ఏవిషయము నందైనా అమితంగా విచారించకూడదు. శరీరము కొన్ని పరిమితులతో ఏర్పడినటువంటిది. ఈ పరిమితమైనటువంటి దేహమునకు పరిమితమైనటువంటి పనినే చెప్పాలి. పరిమితమైనటువంటి పనులుచేస్తూ పరిమితమైన ఆనందాన్ని పొందాలి.

## భగవాన్ సాయి దివ్యబోధ

ఈనాడు మానవతా విలువలను గురించి బాల బాలికలకు బోధిస్తున్నాం. కాని ఆ పిల్లల స్థితిగతులను విచారించి, వారికి బోధించడానికి ప్రయత్నం చేయాలి. బలహీనులైన బిడ్డలకు బలమైన విషయాలు అమితంగా వారిలో ప్రవేశపెట్టటానికి ప్రయత్నించకూడదు. మొట్ట మొదట బలహీనులైన బిడ్డలను బలమైన వారిగా చేయటానికి కొన్ని ప్రయత్నములు చేయాలి. శారీరకంగా, మానసికంగా వారిని అభివృద్ధిచేయాలి. మొట్టమొదట వారికి Health is Wealth (ఆరోగ్యమే మహాభాగ్యము)ను గురించి బోధించాలి. తరువాతనే ఈ విద్యావిధానమును వారిలో ప్రవేశపెట్టాలి.

సంస్కృత పదమైన 'విత్' అనే పదమునుండి 'విద్య' అనే పదము వచ్చింది. 'విత్' అనగా జ్ఞానము, ప్రకాశము, ఆనందము అని అర్థము. ప్రకాశవంతమైనటువంటి, పవిత్రమైనటువంటి, విశాలమైనటువంటి భావములకే 'విత్' అనే పదము ఏర్పడినది. 'విత్' అనే

పదమునకు ఆంగ్లభాషలో "ఎడ్యుకేషన్"అన్నారు. ఈ పదము 'ఎడ్యుకేర్' అనే పదము నుండి వచ్చింది. అనగా బయటకు తీయటం. ఏవిధంగా? గోచరమయ్యేటటువంటి ప్రపంచమునుంచి, అగోచరంగా ఉండినటువంటి వాటిని గోచరింపచేయుటం. అంతర్ముఖంగా ఉండినటువంటి విషయములను బహిర్ముఖం గావించడం. "ఎడ్యుకేర్" అనే పదమునకు రెండు అర్థములు కూడా ఉన్నాయి. తన నుంచి తీయవలసినది ఒకటి. హృదయము నుంచి తీయవలసినది రెండవది. చదవటం, వ్రాయటం, ఉద్యోగాలుచేయటం,సంపాదనలు సలపటం- ఇవన్నీ తననుంచి వచ్చినటువంటివే. ఇవి కేవలం జీవనోపాధి నిమిత్తం ఏర్పడినటువంటివే. ఇవికూడనూ మానవునికి అవసరమే. రెండవది హృదయమునుండి ఆవిర్భవించేటటువంటివి. అవి ఏవి? దయ, ప్రేమ, కరుణ, సహనము, సత్యము- ఇత్యాది పవిత్రమైన గుణములు. ఇవి జీవిత పరమావధి నిమిత్తం ఏర్పడినటువంటివి. జీవనోపాధి ఒకటి. జీవితపరమావధి రెండవది. మొదటిది ప్రవృత్తి లక్షణం. రెండవది నివృత్తి లక్షణం. మొదటిది 'నెగిటివ్' తత్త్వము. రెండవది 'పాజిటివ్' శక్తి. దయ, ప్రేమ అనేటటువంటివి చదవటం వలన వచ్చేటటువంటివి కావు. అవి మన హృదయంలో సహజంగానే ఉంటున్నాయి. ఇవి సహజ తత్త్వములు. కనుక సహజమైనటువంటి వానిని కొన్ని ఉపాయముల చేత బయటకు తెప్పించాలి. ఈ విధంగా తనయందున్నటు వంటివాటిని, తన హృదయము నందున్నటువంటి వాటిని వెలుపలికి తీసి, వాటిని శరీరంతో అనుభవించాలి. తననుంచి వచ్చినవన్నీ తాత్కాలికమైనటువంటివే. ఇవి శాశ్వతమైనటు వంటివి కావు. ఇవి లోకసంబంధమైనటువంటి గుణములే. లోకంలో బ్రతకటానికి ఇవి అత్యవసరములే. ఇవి ప్రవృత్తి మార్గములే. ఇవి జీవనోపాధి నిమిత్తం ఏర్పడినటువంటివే. కాని హృదయంనుంచి ఆవిర్భవించినటువంటి దయ, ప్రేమ, కరుణ, ధర్మము, సత్యము, - ఇత్యాదివన్నీ జీవనోపాధి నిమిత్తం కాకుండా, జీవిత పరమావధి నిమిత్తమై ఏర్పడినటువంటివి. కనుకనే హృదయమునకు Compassion (దయ) అని పేరు పెట్టారు. హృత్+దయ =హృదయ. ఆ హృదయమునకు పేరే 'కరుణ'. కనుక ఈ రెండింటిని మనం సక్రమమైన మార్గంలో అనుభవించి నప్పుడే మన శరీరమునకు ఆరోగ్యమును చేకూర్చిన వారమవుతాము.

మానవతా విలువలు అంటే ఇలాంటివే. మనకు కనిపించనటువంటి సత్యములు మనయందు ఎన్నియో ఉంటున్నాయి. కాని కనిపించేటటువంటివి, వినిపించేటటువంటివి, తలపించేటటువంటివి, మురిపించేటటువంటి వానికే మనం మోజుపడుతున్నాం. కాని కనిపించనటువంటి వానిని గురించి మనం ఏమాత్రం చింతించటం లేదు. కనిపించనటువంటి వానినే అజ్ఞాత శక్తులు అన్నారు. అజ్ఞాతశక్తులు అనగా ఏమిటి? పాండవులు పదునాల్గవ సంవత్సరంలో అజ్ఞాతవాసం చేశారు. పాండవులు ఉన్నారు, కాని ఎవరికీ వారు పాండవులని తెలియకుండా జీవితాన్ని గడుపుతూ వచ్చారు.అదేవిధముగనే ఈ పవిత్రమైన భావములు (దయ, ప్రేమ, కరుణ వగైరాలు) మన హృదయమునందు ఉన్నాయి. కాని అవి మనయందు లేవని, బయటినుంచి తెచ్చుకుంటున్నామని భావిస్తున్నాం.

## అర్చన - అర్పణ

*అర్చన క్రియకంటె। అర్పణే సుగతి సౌ*
*భాగ్యమున్ కల్గించు। భక్తులకును*
*తొమ్మిదిరంధ్రాల। కమ్మని వేణువు*
*దేహమిది యను సం। దీప్తి నొంది*
*శ్రీ సాయికృష్ణుని। చేతి కొసంగగా*
*ప్రభువుగానమె దివ్య।రాగమగును*
*జనుల సేవకుతోడు ।సంకీర్తనలు సాధ*
*నా పథమందు సు। జ్ఞానమొసగు*
*సత్యసాయి యనుగ్రహ । సంతరణము*
*జన్మసంస్కారపూర్ణ ప్ర।సాదముకద!*
*పరహితార్థాల పరమార్థ। భావమొంది*
*పర్తిపురము చేరుకొనుడో! భక్తులార!*

- పంచాంగము శీనప్పశాస్త్రి

ఇవి ఎవరూ ఇచ్చేటటువంటివికావు, బయటనుంచి తెచ్చుకునేటటువంటివికావు, గురువు బోధించేటటు వంటివికావు. గ్రంధములు అందించేటటువంటివి కావు. ఇవి మన హృదయమునుండి ఆవిర్భవించేటటువంటివే. అవియే నిజమైనటువంటి మానవతా విలువలు. తననుంచి వచ్చేటటువంటివి బాహ్యమైన ప్రకృతి విలువలు. హృదయమునుంచి వచ్చేటటువంటివి పరతత్త్వ విలువలు. కనుక ప్రకృతి విలువలు వేరు, పరతత్త్వ విలువలు వేరు. ఆ పరతత్త్వ విలువలనే 'మానవతా విలువలు' అన్నారు. అయితే వాటిని ఈనాడు మనం కోల్పోయినాం, అందు వలన మానవుడు ఆకార మానవునిగా కనిపిస్తున్నాడు గాని, ఆచరణ మానవునిగా కనిపించటంలేదు.

ఆరోగ్యమును మనం కాపాడుకుంటే మానవతా విలువలను అది పోషిస్తుంది. ఏ అంగమూ ప్రధానంకాదు. అన్ని అంగముల ఏకత్వమే ఈ శరీరము. కనుక అన్ని అంగములయందు ఐకమత్యం అత్యవసరం. ఈ మానవతా విలువలలోపల మొట్టమొదట మనం బోధించ వలసినది' ఐకమత్యము'. ఇదే నిజమైన Unity. అసలు Unity లేనప్పుడు Purity ఎక్కడ నుంచి వస్తుంది ? కేవలం హలో!....హలో!.....అంటే ప్రయోజనం లేదు. సన్నిహిత సంబంధ బాంధవ్యాన్ని పెంచుకోవాలి. అందరూ ఒక తల్లిబిడ్డలే . కనుకనే Brother Hood of Man, Father Hood of God అనేది మొదట బోధించాలి. మన మందరమూ భగవంతుని బిడ్డలమే. రూపనామములు వేరు, దేశభాషలు వేరు. అంతమాత్రమునే ఎవర్నీ పరాయి వారుగా భావించరాదు. పరాయివారుగా భావించటం చేతనే మనకు 'పరతత్త్వం 'అంటే అర్థం కావటం లేదు. పరాయి వారెవరూ కాదు. అందరూ ఏకకుటుంబీకులే . ప్రతి వ్యక్తీ ఈ విశ్వకుటుంబంలో సభ్యుడే. ఆ సత్యమును మొట్టమొదట గుర్తించి పిల్లలకు బోధించాలి. పిల్లలకు బోధించేముందు మీరు ఆచరించి చూపించాలి. కనుక మొట్టమొదట. Be Good, రెండవది Do Good , మూడవది See Good కాని ఈనాడు అది మాత్రం నీలో లేదు. అందరికి మాత్రం సత్యధర్మ శాంతి ప్రేమ అహింసలు బోధిస్తున్నావు. ఈబోధించడం కన్నా, ఆచరించి చూపించుతే ఎంతైనాప్రచారం అవుతుంది. ఈ కాలంలోని పిల్లలు మహా తెలివితేటలు గలవారు. కలియుగ ప్రభావం చేత ఆధునిక విద్యలు ఎన్నెన్నో నేర్చుకోగలుగుతున్నారు. బోధించే ముందర ఆచరించి పిల్లలకు బోధిస్తే, వారు తప్పకుండా ఆచరిస్తారు. పిల్లలు చాలా తెలివితేటలతో చూస్తూ వుంటారు, వింటూ వుంటారు ఆచరించని విషయాలు బోధిస్తుంటే, వారు కనిపెట్టి, బోధించే గురువే ఆచరించనప్పుడు, మనం ఎందుకు ఆచరించాలి? అని నిర్లక్ష్యంగా వింటుంటారు. అందువలన ఆచరించి బోధించాలి. అప్పుడే పిల్లల చేత సరియైన విద్యను అభ్యసించేటట్లు చేసిన వారమవుతాము. అందువలననే బోధించే వ్యక్తికి అధ్యాపకుడు, ఆచార్యుడు అని పేరు పెట్టారు. ఆచరించి బోధించేటటువంటివాడు 'ఆచార్యుడు'అని అర్థం. అయితే ఈనాడు 'ఆచార్య'అనే పదమునకు విలువ లేకుండా చేస్తున్నారు. ఈనాటి బోధనలు ఆచరించి బోధించేటటువంటివి కావు. కేవలం గ్రంధపరిచయంతో బోధిస్తున్నారు. అందువలన ఆశించిన ఫలితాలు చూడలేక పోతున్నాం .

ఈనాటి బేధములకు మూలకారణం అనైక్యతే. కనుక మొట్టమొదట 'ఐకమత్యము'ను సాధించాలి. అందులో సాయి సంస్థలలో ప్రవేశించినవారు, ఐకమత్యమును ఒక ప్రత్యేకమైన మార్గంలో అనుసరించాలి. ఏదేశం వారినయినా, ఏమతం వారినైనా, ఏభాషవారినైనా,

ఏవయస్సువారినైనా సాయి ఏ విధంగా సమానత్వంగా చూచుకుంటున్నాడో, అదేరీతిని మీరు కూడా అను సరించాలి. కనుకనే "Follow the Master" నీ మాష్టర్‌ను నీవు అనుసరించు. అయితే కేవలం అంటు న్నావు గాని చేయటం లేదు. నీ Master అందరినీ సమంగా చూస్తున్న ప్పుడు, నీవు ఎందుకు చూడవు?ఐకమత్యమును పెంచు కున్నప్పుడే నిజమైన స్వాతంత్ర్యమును సాధించిన వారమవు తాం . ఇట్టి స్వాతంత్ర్యం వచ్చినప్పుడే పరతత్త్వాన్ని మనం అనుభవిస్తాం కనుక దివ్యత్వమైనటు వంటి మానవతా విలువలను మనం పెంచుకోవాలనుకుంటే మొట్టమొదట ఐకమత్యమును మనం పెంచు కోవాలి.

ఈనాటి ఆధునిక యుగంలో 80 శాతం రోగాలు మానసిక రుగ్మతలమూలంగానే వస్తున్నాయి. నా నాడి సరీగా ఉన్నదా? లేదా? అనే అనుమానంతో నీ నాడిని చూచుకుంటుంటే ఎక్కువైనా అవుతుంది, తక్కువైనా అవుతుంది.. నీవు దానిపై చింతపెట్టుకోకు. ఆనందంగా నీ కర్తవ్యమును నీవు నిర్వర్తించుకుంటూరా. అది సక్రమ మైన మార్గమును అనుసరిస్తుంది. భగవత్ సృష్టిలో ప్రతి కర్మకూడనూ ఒక నియమబద్ధమైనటువంటిదే. సూర్యో దయసూర్యాస్తమయములుకూడనూ ఒక నియమానికి అనుసరించినటువంటివే. కాని సూర్యోదయ సూర్యాస్త మయములు కూడనూ, దైవనిర్ణయమును అనుసరిస్తూ, దైవనియమాన్ని అనుసరిస్తూ నడుస్తున్నప్పుడు, తెలివి తేటలు గల మానవుడు ఎందుకు అనుసరించడు? ఈనాడు లౌకికమైన ప్రజ్ఞానశక్తి మానవుని ఒక యంత్రంగా మార్చివేస్తుంది. ఈ ప్రజ్ఞాన శక్తిని అందుకోవాలని ప్రయత్నిస్తున్నాడు. ఈ ప్రజ్ఞాన శక్తిని Information oriental Knowledge అంటారు. కాని Knowledge కాదు ముఖ్యం. Information కాదు ముఖ్యం నిజమైన మానవతా విలువలు రావాలంటే Transformation కావాలి. ఈ Information Knowledge (సమాచార జ్ఞానం) మానవుణ్ని కేవలం Computer గా మార్చివేస్తున్నది. Computer గా మారినంత మాత్రమున ప్రయోజనంలేదు, Composer గా మనం మారాలి. అదియే నిజమైన మానవతా విలువ. Composer గనుక లేకపోతే Computer ఏం పనిచేస్తుంది? ఈ మానవతా విలువలు అనేవి Composer గా మార్చి వేస్తాయి. కాని భౌతికమైన శక్తులు మాత్రం Computer గా మార్చివేస్తాయి. ఈనాడు ప్రతి ఒక్కరూ 'కంప్యూటర్.... కంప్యూటర్' అంటున్నారు. దానిని ఎక్కువగా ఇష్టపడు తున్నారు. దీని వలన కలిగేటటువంటి ఫలితం ఏమిటి? కట్టకడపటికి సహజసిద్ధమైన మన బుర్రలోని తెలివి తేటలను కూడా మరిచిపోతున్నాం. నిజమైన కంప్యూటర్ మన బుర్రలో వుంటున్నది. ఆ దగ్గర వున్న 'కంప్యూటర్‌ను మరచిపోయి, డబ్బు యిచ్చి కొనుక్కొని దానితో ప్రయత్నం చేస్తున్నాం. ఇంతకన్నా అమాయకత్వం ఎక్కడనైనా ఉన్నదా? భగవంతుడు అనుగ్రహించిన బుర్రను ఉపయోగించుకోవడంలేదు. అసలు Original Computer మన దగ్గర ఉంటున్నది. దానిని అనుసరించాలి. కాని ఈనాడు Original ను వదిలిపెడుతున్నారు. Artificial ను అనుసరిస్తున్నారు. Art is Out Side, Heart is Inside. ఈ Art ను ఆశిస్తున్నారేగాని Heart ను ఆశించడంలేదు. మనం Heart ను అనుసరిస్తే Art అంతా దాని నుండి వచ్చేస్తుంది. Art comes from the Heart. ఈ సత్యమును మొట్టమొదట మనం గుర్తించాలి.

ఈనాటి విద్యావిధానంలో మనం ఎంతైనా మార్పు చేయవలసింది ఉన్నది. బాలవికాస్ గురువులు దీనిని చక్కగా గ్రహించి, పిల్లల ద్వారా ప్రపంచానికి మంచిని వ్యాప్తి గావించాలి. అనేకమంది పురుషులు ఈ బాలవికాస్ కార్యక్రమాలలో పాల్గొనటంలేదు. ఉదాహర ణకు ఈనాడు చూడండి! సర్టిఫికేట్లు ఆడవారికి ఎన్ని వచ్చాయి? మగవారికి ఎన్ని వచ్చాయి? ఆడవారు అధ్యాప కులుగా ఉండటంచేతనే, ఇంత అభివృద్ధి కనిపిస్తున్నది. కనుక మగవారు కూడా ప్రవేశించి తగిన ఉత్సాహం ప్రోత్సా హములను అందించాలి. బాలవికాస్ కార్యక్రమాలను అభివృద్ధి పరచాలి. పిల్లల కోసం ఆడవారు రాత్రింబవళ్ళు కష్టపడుతున్నారు. మగవారు ఆ విధంగా చేయటంలేదు. స్త్రీలలోవున్న శ్రద్ధాభక్తులు, పురుషులలో కూడావుంటే ఎంతైనా ప్రపంచాన్ని మార్పుచేయవచ్చును. లేడీ టీచర్లు మాతృభావనతో బోధిస్తారు. తమ బిడ్డలలాగే భావించి, ప్రేమించి, బుజ్జగించి, లాలించి వారికి బోధిస్తుంటారు.

కాని మగవారు తండ్రివలే జబర్ దస్తీ చేస్తూ, కఠినంగా చెబుతుంటారు. ఆ బోధనలు మారినప్పుడే మానవతా విలువలు బాలబాలికలకు వంటపడుతాయి. బోధనలు ప్రేమపూర్వకంగా చేయాలి. మగవారు ఆవిధంగా చేయలేరు. పిల్లలకు ఎవరికైనా జబ్బుచేస్తే, మహిళా టీచర్లు ఇంటికివెళ్ళి కూడా పరామర్శించి వస్తారు. మగవారి యందుకూడనూ ఈ ప్రేమతత్త్వము అభివృద్ధి కావాలి. అప్పుడే సర్వసమానత్వం మనకు ప్రాప్తిస్తుంది. మగవారి యందు సహజంగా అహంకారం ఉంటుంది. ఈ అహం కారమే వారిని చెడగొడుతున్నది. పిల్లలకు బోధించే సమ యంలో అహంకారాన్ని దూరం చేసుకోవాలి. మృదు మధురంగా బోధించాలి.

బెంగుళూరులో టెలిఫోన్ ఫ్యాక్టరీ ఉన్నది. ఆ ఫ్యాక్టరీలో పనిచేసేవారు అందరూ ఆడవారే. "ఎందుకు మగపిల్లల్ని తీసుకోరు?" అని ఆ ఛైర్మన్‌ను ప్రశ్నించాను. అప్పుడు ఆ ఛైర్మన్ "ఒక ఆడపిల్ల చేసే పని పదిమంది మగపిల్లలు కూడా చేయరు?" అన్నాడు. ఆడవారు పట్టుదలపడితే దానిని సాధించేదాకా నిద్రపోరు. ఇంకా ఒక చిన్న విషయం గమనించండి. మగవారు కారు నడుపు తారు, ఆడవారు నడుపుతారు. కాని ఎక్కువ యాక్సిడెంట్లు మగవారు నడిపే కార్లకే అవుతుంటాయి. ఎందువలన? ఆడవారు మగవారికన్నా ఏకాగ్రతతో కారు నడుపగలరు. ఆ ఏకాగ్రత మగవారిలో కూడా వచ్చిన ప్పుడు దేశం అన్ని రంగాలలో బాగుపడుతుంది. ప్రత్యేకంగా సత్యసాయి సంస్థలలో పనిచేసేవారు కడు జాగరూకత తోవుండాలి. ఇక్కడపనిచేసేవారు మంచి చేసినా చెడ్డ చేసినా అది సత్యసాయికే వస్తుంది. కనుక సత్యసాయికి పేరు తీసుకొని రావాలంటే మీరు సత్యమైన మార్గమును అనుసరిస్తూరావాలి. మన సంస్థలో ఒకరినొకరు కలహించు కుంటున్నారనే నింద రాకూడదు. మనలో ఏమాత్రం బేధభావములు పెట్టుకోకూడదు. ఐకమత్యంతో సాధించ డానికి ప్రయత్నం చేయాలి. అన్నింటికీ ప్రేమయే ఆధారము. ప్రేమనే దైవము. ఆ ప్రేమ యందే జీవించడానికి ప్రయత్నం చేయండి. Love is God, Live in Love.

ఫ్యాక్టరీలలో, ఆఫీసులలో వారానికి ఒక రోజు సెలవు యిస్తుంటారు. దేనికోసం? ఆరు దినములు పనిచేసారు కాబట్టి ఈ దేహమునకు ఏడవ దినం విశ్రాంతి అవసరం. ఎందుకంటే జడమైన యంత్రమునకే కొంత విశ్రాంతి యిస్తుంటారు. అమితంగా అదిపనిచేస్తే ఆ ఇనుప మిషన్ కూడా చెడిపోతుంది. కనుక ప్రాణంతో కూడిన ఈ దేహమునకు కొంత విశ్రాంతి అవసరమే. కాని ఈ సాయి ఏ Sunday అయినా Holiday తీసుకుంటున్నాడా? లేదు... లేదు... ప్రతి క్షణమూ నా కర్తవ్యాన్ని నేను నిర్వర్తిస్తున్నాను. దీనినే "కర్తవ్యం యోగముచ్యతే" అన్నారు. కాబట్టి Do your Duty, Duty is God, Work is Worship. పెద్దలు ఆదర్శమైన జీవితాన్ని గడుపుతుంటే, పిల్లలు కూడా మిమ్ములను అనుసరిస్తుం టారు. కనుక ఈనాడు పెద్దలు మొట్టమొదట ఈ మానవతా విలువలను అభివృద్ధి గావించడానికి కంకణం కట్టు కోవాలి. ఈ ఛైర్మన్లు, కో-ఆర్డినేటర్లు, సెక్రటరీలు - వీరందరూ కూడనూ కర్మలలో ప్రవేశించాలి. ఏదో వ్రాసి పదిమందికి పంచడం కాదు ముఖ్యం. ఈ Circulation తో జరిగేటటువంటిదికాదు. మనలోపల Circulate కావాలి. అప్పుడే మనలో ఒక విధమైనటువంటి Transformation వస్తుంది. లేకపోతే జీవితమంతా Information తోనే వృధా అయిపోతుంది. Information ముఖ్యంకాదు. Information కేవలం Quantity. Transformation, Quality. డిగ్రీలు, సర్టిఫికేట్లు ఎంతమందికి ఇచ్చామనేది ప్రధానం కాదు. ఎంతమందిని బాగుచేశామనేది ముఖ్యం.

# విదురనీతి

"ఆక్రోశ పరివాదాభ్యాం
విహింసన్త్య బుధా బుధాన్
వక్తా పాపముదాత్తే
క్షమ మాణో విముచ్యతే"

అజ్ఞానులు తిట్లతో, నిందలతో పండితులను హింసించుచున్నారు. పాపము తిట్టువారిని, నిందించు వారిని చేరును. క్షమించువారు మాత్రం దాని నుంది విముక్తులగుదురు.

సేవ.... సేవ..... అంటారు. సేవ అంటే ఏమిటి? బజార్లు ఊడ్చటం సేవకాదు. మందిరాలు శుభ్రం చేయటం సేవకాదు. నారాయణసేవ చేయటం సేవకాదు. మన Duty ని మనం సక్రమంగా చేయాలి. మన Duty ని తగిన రీతిలో చేసినప్పుడు, అది కూడా ఒక సేవయే. నీకు ఇచ్చే జీతానికి తగినంత పనిచేయటం కూడా సేవయే. వేలాది రూపాయలు జీతం తీసుకుంటున్నారు. వందల రూపాయల పనికూడా చేయటంలేదు. ఇది సేవ అని ఏవిధంగా చెప్పగలం? తీసుకున్న దానికి తగిన పని చేయాలి. అదియే దేశానికి సేవ. అదియే దేశానికి సహాయం. సమాజానికి సరియైన సేవ చేయటం అంటే అదే. సాయి సంస్థలలో చేరినటువంటివారు కండలు కరిగి, ఎముకలు అరిగేటట్లుగా పనిచేయాలి. మొట్టమొదట కష్టపడి పని చేయండి, శ్రమించండి, కష్టపడండి. తరువాత ఆనందంగా భుజించండి. అప్పుడు చక్కటి ఆరోగ్యం కలుగుతుంది. ఆరోగ్యమైన దేహంతో ఎన్ని పనులైనా చేయవచ్చును.

సంపాదించిన ధనధాన్యవస్తువాహనాదులు అన్నీ గాలిమేడలవలె ఎగిరిపోతుంటాయి. డబ్బును సంపాదించటం గొప్పతనంకాదు, నీతిని సంపాదించాలి. బజారులోని బిచ్చగాడు కూడ డబ్బును సంపాదిస్తాడు. సంపాదించిన ధనంలో ఒక్క కాసుకూడా వెంటతీసుకొని ఎవరూ పోరు. కనుక మనం సంపాదించినది సమాజానికి అర్పితం చేయాలి. సమాజసేవలలో పాల్గొనాలి. నేను 'ధనవంతుణ్ణి' అని అహంకారపడటం గొప్పతనంకాదు. త్యాగేనిజమైనటువంటి భోగి. ఈ ధనంతో భోగపడేటటువంటి వాడే నిజమైన రోగి. కనుక మనం రోగులం కాకూడదు. త్యాగులం కావాలి.

**ప్రేమస్వరూపులారా!**

**ప్రేమను పెంచుకోండి! ఆరోగ్యమును అభివృద్ధి చేసుకోండి! సమాజ సేవలలో పాల్గొనండి! అప్పుడే మీకు** దైవానుగ్రహంచేత సరియైనటువంటి శక్తి సామర్థ్యములు లభిస్తాయి. నీవు కష్టపడి భగవంతునికి సేవచేసినప్పుడు, నిన్ను ఎందుకు ఉద్ధరించడు భగవంతుడు? ఆ నమ్మకంతో పనిచేస్తూ రావాలి. కాని ఈనాడు అట్టినమ్మకం చాలా తగ్గిపోయింది. కారణమేమిటి? నీయొక్క విశ్వాసదోషమే దీనికి మూలకారణం. కనుక మనం విశ్వాసాన్ని పెంచుకోవాలి. ఆ విశ్వాసాన్ని పెంచుకొంటూపోయినప్పుడే మనకు భగవంతుడు శక్తిని అనుగ్రహిస్తాడు. ఆ పరిపూర్ణమైనటువంటి భక్తిని మీరు పెంచుకోవాలి. అభేద్యమైన భావాన్ని పెంచుకోవాలి. Slow and Study wins the Race. ఈ రెండింటి ద్వారానే మీరు సమాజంలో విజయాన్ని సాధించవచ్చును.

కేవలం భక్తి.... భక్తి... అంటూ 'రామ, కృష్ణా, గోవిందా' అంటే చాలదు. ఇవన్నీ ప్రాకృతమైన సాధనలే. ఈ నామములన్నీ సత్కర్మలకు మాత్రమే సంబంధించినటువంటివి. ఈ సత్కర్మలవలన సద్భావనలు రావచ్చుగాని మానసిక శాంతి మాత్రంరాదు. మానసిక శాంతి రావాలంటే పరిపూర్ణమైనటువంటి విశ్వాసంతో మీరు పనిలో ప్రవేశించాలి. ఈనాడు ప్రతివానికి కావల్సినటు వంటిది మానసిక శాంతి. మానసిక శాంతి లేక అనేకమంది అనేక అవస్థలకు గురిఅవుతున్నారు. మానసిక శాంతి రావాలంటే హృదయపూర్వకంగా, నా సోదరులకు, నా సోదరీమణులకు **సేవ చేస్తున్నాననే ప్రేమభావంచేత, సంబంధ బాంధవ్యం చేత మీరు సేవలలో ప్రవేశించాలి. ఏదో కొన్ని విషయాలలో బేధాభిప్రాయాలు కలిగినప్పటికీ, మరు నిముషంలోనే మార్చుకోవాలి ఆ ద్వేషాన్నిఅట్లే పెంచుకుంటూ పోగూడదు.** దీనికి పాండవులే చక్కటి ఆదర్శం. పాండవులు అరణ్యావాసంలో ఉన్నప్పుడు కృష్ణుడు ఒక పర్యాయం పాండవులు నివశించే పర్ణశాలకు వెళ్ళుతాడు. అక్కడ ఒక ధర్మరాజు మాత్రమే ఉంటాడు. అప్పుడు కృష్ణుడు "ధర్మజా! నీ సోదరులు ఏరి?" అని అడుగగా "కృష్ణా! నలుగురు ఆహారం తీసుకొని రావటానికివెళ్ళారు. మిగతా నూరు మంది హస్తినాపురంలో ఉన్నారు"అని ధర్మజుడు సమాధానం చెప్పగా, అప్పుడు కృష్ణుడు 'ధర్మజా! ఆ నూరు మందివలననే గదా! మీకు ఈ యిక్కట్లు సంభవించినాయి. మీరు పంచపాండవులే. మీ సోదరులు ఐదుగురే' అని అంటాడు. అప్పుడు మరల ధర్మరాజు "కృష్ణా! మేము నూటఐదుగురం సోదరులం. మాలో మాకు బేధాభిప్రాయం వస్తే మేము ఐదుగురు సోదరులం, కౌరవులు వందమంది. మా కుటుంబంపై ఎవరైనా వచ్చిపడితే, **మేము నూట ఐదుగురం కలిసి ఎదిరిస్తాం. కాబట్టి కొంచెం**

భేధభావం కలిగినంత మాత్రమున వారు మాకు సోదరులు కాకుండాపోరు. వారునూ సోదరులే"అని అంటాడు. కనుక మనం ఈనాడు ఆ విధమైనటువంటి సోదరభావమును పెంచుకుంటూపోవాలి. అట్టి ఐకమత్యమును మనం ఈనాడు పెంచుకోవాలి. "మా సాయి సంస్థల లోపల ఏ విధమైనటు వంటి కలహములు లేవు, ఏవిధమైన భేధభావ ములులేవు. ఒక్క తల్లి బిడ్డల వలె జీవిస్తున్నారు. ఈ విధమైన ఆదర్శం ఏ సంస్థ యందూలేదు" అనేటటువంటి సత్కీర్తిని మీరు తీసుకొనిరండి. ఆ పేరు ఒక్కటే మనకు చాలు. ఆ పేరే ముఖ్యమైనది. మంచిపేరు తెచ్చుకుంటే గొప్పవారమైపోతాం. అందరూ మంచివారు కావాలి. అందరూ సాయిసంస్థలో అన్నదమ్ములవలె పెరగాలి.

ఐకమత్యమనేది చాలా అవసరం. ఐకమత్యంతో ఎంతటి పనినైనా సాధించవచ్చును. అందరూకలిసి పనిచేస్తే ఎంత పనైనా చేయవచ్చు. అన్నీ విజయవంతం అవుతాయి. ఏ ఒక్కటీ విఫలం కాదు. కనుక కలిసిమెలసి పనిచేయండి!

"కలిసి మెలసి పెరుగుదాం
కలసి మెలసి తిరుగుదాం
కలసి మెలసి తెలుసుకున్న
తెలివిని పోషించుదాం
కలసి మెలసి కలతలేక
చెలిమితో జీవించుదాం"

ఈనాడు ఏ సేవచేసినా ఎవరికో చేస్తున్నామనే భావమును మాత్రం మరచి, మాకు మేమే చేసుకుంటు న్నామనే 'ఏకాత్మభావన'ను పెంచుకోవాలి. ఈ విధమై నటువంటి ఏకాత్మ భావనను పెంచుకున్నప్పుడు "ఏకం సత్ విప్రా బహుదావదంతి". అప్పుడే సమత్వం ఏర్పడు తుంది. దీనికి స్వామి యొక్క Permisson (అనుమతి) ఉండనవసరంలేదు. వారు ఆశించినదానినంతా నేను "తథాస్తు... తథాస్తు "అని ఆశీర్వదిస్తుంటాను.

*(ది. 20-11-1998న సాయికుల్వంత్ మందిరంలో బాలవికాస్ కార్యక్రమంలో భగవాన్ సాయిచేసిన దివ్య ప్రసంగం నుండి)*

రసవద్ఘట్టాలు - 42

## బరువును గమనించాలి

ఫ్రాన్స్ దేశచక్రవర్తి నెపోలియన్, ఒకసంపన్న మహిళతోపాటు ప్యారిస్ నగర వీధులలో విహరిస్తున్నాడు. అంగరక్షకులెవరూలేరు. రాజవీధులుకాక చిన్నసందుల్లో వెళ్తున్నారు. మహిళ ముందుగ వెళ్తున్నది. ఆమె వెనుక కొద్దిదూరంలో నెపోలియన్.

ఇరుకైనదారిలో ఎదురుగా ఒక కూలి, నెత్తిపై పెద్ద బరువుతో ఎదురైనాడు. సంపన్నమహిళకు తన హోదా, ప్రతిష్ఠలతో పాటు, చక్రవర్తితోపాటు తిరుగుతున్నానన్న గర్వం ఎంతగానో ఉండేది. అట్టిస్థితిలో ఒక సామాన్య కూలి వాడికి దారి ఇవ్వటం ఎలా సహిస్తుంది? ఆ కూలి మనిషిని చూచీ చూడనట్లు ధీమాగా వెళ్తూఉంది.

కూలివానిని చూచిన నెపోలియన్ అతనికి దారి ఇవ్వాలనుకున్నాడు. కాని ఆమె ఇరుకు దారి మధ్యలోనే ఠీవిగా నడుస్తూ ఉంది. కూలివాడు ఆమె చేతిని పట్టుకొని పక్కకు తోశాడు. నెపోలియన్ అతనికి దారి ఇచ్చాడు. "మేడమ్ ఆ కూలి మనిషి మోస్తున్న బరువును మనం గౌరవించాలి" అన్నాడునెపోలియన్.

మహిళ నివ్వెరపోయింది! ఒక చక్రవర్తి అతి సామాన్యుడైన కూలి మనిషికి దారి ఇవ్వటం ద్వారా అతన్ని గౌరవించటమా! అనుకొన్నది. "మేడమ్, ఈ సామాన్య ప్రజలే నాదేశానికి ఆధారం అన్న విషయం మనం విస్మరించరాదు అంటూ నమ్రతాభావంతో పలికాడు నెపోలియన్. మహిళ నెపోలియన్ భావాన్ని గ్రహించింది. కూలివాడి తలపైనున్న బరువు పెద్దదైనా, చిన్నదైనా దానిని మనం గౌరవించాలని నెపోలియన్ క్రియాత్మకంగా సూచించారు. నెపోలియన్ వ్యక్తిత్వ వైశిష్ట్యం అదే.

- జానమద్ది హనుమచ్ఛాస్త్రి

# అనశ్వరాత్మ

ఆత్మ, పరమాత్మల స్వరూప స్వభావాలు- వాటి సంబంధ బాంధవ్యాలు అర్థంచేసుకోవడం మానవునికంత సులభ సాధ్యంకాదు. అందుకు కారణము ఒక్కటే! రకరకాల భ్రమలు ఆతని మస్తిష్కంలో ప్రవేశించి బుద్ధిని మందగింపచేస్తాయి. ఆ పొరలు తొలగించుకొన్ననాడు ఆతనికి అర్థంకానిదంటూ ఏదీ ఉండదు.

సగటు మానవుడు ప్రాపంచిక జీవిత సుఖాలే సర్వస్వమని భ్రమించి సంతృప్తి చెందుతాడు. పరలోక భావన, ఆధ్యాత్మిక చింతనల తలపే రానీయడు. ఈ శరీరము అశాశ్వతమని తెలిసినా, ఆత్మ అంటే శరీరమేనన్న భ్రమలో పడిపోతాడు. అందుకే జీవితంలోని సుఖదుఃఖాలకు అనుగుణంగ చలించిపోతాడు. లోకంలో ఈ తరగతికి చెందినవారే అధికం! వారందరికి, ఆత్మకు-దేహానికి గల భేదము తెలియదు-తెలిసికోరు!

శరీరం వేరు- ఆత్మవేరు అని తెలిసికొన్నవారు రెండవతరగతి వారు! అంటే ఆత్మ, దేహం ఒకటేనన్న భ్రమనుంచి వీరు బయటపడతారు! కానివీరు, ఆత్మయన్నది వ్యక్తిగతమని, స్వతంత్ర ప్రతిపత్తిగలదని, మానవుని ఇచ్ఛాప్రకారము సంచరించగలదన్న భ్రమలో పడిపోతారు. ఇది మరింత ప్రమాదకరమైన భ్రాంతి! ఎందువలనంటే, ఈ భ్రమవలన, మానవునిలో అహంకారమంకురిస్తుంది. సర్వకార్యములు స్వయంశక్తితోనే సాధించగలనన్న గర్వము జనిస్తుంది. అంతా స్వీయప్రయోజనకత్వమేనని విఱ్ఱవీగుతాడు! ఈ భ్రాంతే ఆతని పతనానికి దారితీస్తుంది! పరమాత్ముడొక్కడే సర్వస్వతంత్ర శక్తిమంతుడన్న జ్ఞానము కలిగినపుడే, ఆ మానవుడు ఆ భ్రమలోంచి బయటపడతాడు!

ఆత్మ, పరమాత్మలకుండే అవినాభావ సంబంధం మరింత జటిలమైనది. ఆ సంబంధ బాంధవ్యాలను తెలిసికోడానికి, వేదాంతంయొక్క భావనలే మనకు మూలాధారం! ఆధ్యాత్మిక జ్ఞానంపైనున్న అపోహాలు, సందేహాలు, సంశయాలు తొలగిపోవాలంటే, మానవునికి దేహము-ఆత్మ-పరమాత్మ; ఈ మూడింటి పరిచయము, పరిజ్ఞానము కలగాల్సిందే! అందుకే భగవద్గీత ఆరంభంలోనే ఈ ప్రస్తావన చేయడం జరుగుతుంది!

కురుక్షేత్ర సంగ్రామానికి సమాయత్తమైన అర్జునుని రథసారథి శ్రీకృష్ణభగవానుడు రణరంగ మధ్యభాగాన నిలిపాడు! శత్రుసైన్యబలాన్ని ఒక్కసారి పరికించి చూడమని చెప్పాడు! ఎదుట నిలచియున్న తాతలను, తండ్రులను, గురువులను, బంధువులను, చూచిన అర్జునుడు తీవ్రసంక్షోభానికి, ఆందోళనకు గురౌతాడు.

“కృష్ణా! యుద్ధమునకై సంసిద్ధులై వచ్చిన ఈ ఆత్మబంధువులను చూచినంతనే నామనస్సు తల్లడిల్లిపోతోంది. ఒడలు గగుర్పాటుచెంది వణికి పోతోంది.

**సోమంచి రామం**

నాశరీరము, నామనసు, నాస్వాధీనము తప్పుచున్నవి. ఈ యుద్ధముపేరిట స్వజనులను సంహరించుట శ్రేయస్కరము కాదనిపించుచున్నది. నాకు రాజ్యభోగమక్కరలేదు. బంధుజనముల జంపుకొని, రాజ్యసుఖములను కోరుకొని వచ్చిన నేను ఎంతటి పాపమున కొడిగట్టితిని” - అంటూ మొరపెట్టుకొన్నాడు!

“అర్జునా!నీ ధర్మసందేహము నాకర్థమైనది. నీవు పాపమునకు ఒడిగట్టితివని భ్రమపడుచున్నావు. పాపమన్నది రెండువిధములు. నిషిద్ధకర్మలాచరించుట- అనగా చేయకూడని పనులుచేయుట మొదటిది. నిర్దేశిత కర్మలాచరించకపోవుట- అనగా చేయవలసిన పనులు చేయకపోవుట రెండవది. ఇప్పుడు యుద్ధముచేసి ధర్మమును రక్షింపవలసిన నీవు యుద్ధము చేయకుండ వెనుతిరిగినయెడ, నీ కర్తవ్యమునుమాని, ధర్మహానికి కారకుడవై, పాపివై నరకమున బడుదువు! అయిననూ కర్తవ్యతా దృష్టితోచేయు కార్యములకు పాప,పుణ్యములు అంటవు! అంతేకాదు! ఈ శరీరములు అశాశ్వతములు! ఆత్మయొక్కటే శాశ్వతమైనది. అదే అనశ్వరాత్మ! దానికి చావులేదు. కావున ఆత్మతత్త్వమును తెలిసికొని, సుఖ దుఃఖమును దూరము చేసికొని నీ కర్తవ్యమును నిర్వహింపుము” - అని శ్రీకృష్ణుడు ప్రబోధించాడు.

ఈ విధముగా దేహము, ఆత్మ-పరమాత్మల సంబంధముల నవగాహన చేసికొని, తమ కర్తవ్యమును నిర్వర్తించుటయే మానవుల విధి!

# హెల్త్, వెల్త్ తల్లిదండ్రుల ఆశీర్వాద ఫలితమే

ఈనాడు లోకంలో దుర్మార్గులైన కుమారులైనా ఉన్నారుగాని, దుర్మార్గురాలైన తల్లులు మాత్రంలేరు. పవిత్రులైన తల్లులు ఎన్నో విధములైన శక్తులు అందిస్తూ వచ్చారు. మీ బ్లడ్డు, మీ ఫుడ్డు, మీ దుడ్డు, మీ శక్తి అంతా మీ తల్లుల ప్రభావమే. ఇంత త్యాగం చేసిన మీ తల్లికి ఏమాత్రం కృతజ్ఞతజూపుతున్నారు? ఈ దేహం ఎక్కడ నుంచి వచ్చింది? దీనిని ఎవరు పెంచిపెద్ద చేశారు? ప్రాణాన్ని కూడా త్యాగంచేసి అభివృద్ధిగావించింది తల్లియే. కాబట్టి తల్లిప్రేమను మనం మరువకూడదు. కనుక మొట్ట మొదట తల్లిని ప్రేమించాలి. తరువాత తండ్రిని ప్రేమించాలి. తరువాత గురువును గౌరవించాలి. తరువాత దైవాన్ని పూజించాలి. తల్లి తండ్రిని చూపుతుంది. తండ్రి గురువును చూపుతాడు. గురువుదైవాన్ని చూపుతాడు. కనుక ఈ నల్గురిని మనం ప్రేమించాలి, గౌరవించాలి, పూజించాలి. తల్లులు ప్రతి కార్యానికి ముందంజవేస్తున్నారు. ఆధ్యాత్మిక మార్గమునందుకూడా తల్లులే మార్గమును చూపుతున్నారు. ప్రతి పవిత్రమైన కార్యమునకు తల్లులే మూలకారణం. ఇట్టి తల్లులను మనం ఏనాటికీ మరువరాదు. ఎలాంటి పరిస్థితులలోను తల్లిని మరువరాదు, విడువరాదు. ఈనాడు కలి ప్రభావం వలన కొందరు తల్లిని వంటమనిషిగా చూస్తున్నారు. పని మనిషిగా భావిస్తున్నారు మరికొందరు. ఇది ఎన్ని జన్మలకర్మయో. తల్లి త్యాగశీలి. ఉదాహరణకు ఒక తల్లి బిడ్డను ఎత్తుకొని పోతుంటుంది. ఏదైనా క్రూరమృగం ఎదురువచ్చిందంటే, తన దేహమునైనా దానికి అర్పించ డానికి సిద్ధమవుతుందిగాని, తన బిడ్డను మాత్రం కాపాడు కుంటుంది. అంతటి త్యాగశీలురు తల్లులు, పవిత్రమైన భావం కలిగినటువంటి వారు తల్లులు. తన కుమారులు అభివృద్ధిలోనికి వచ్చారంటే ఆనందించేవారు తల్లులు. ఒకరు బాగుపడుతుంటే ఇతరులు అసూయపడ వచ్చును. ద్వేషించవచ్చును. తన కుమారుని అభివృద్ధిని చూచి ఆనందించేది ఒక తల్లి మాత్రమే. కుమారుడు ఎంత అభివృద్ధిలోనికి వస్తే అంత ఆనందిస్తుంది తల్లి. మన దేశమును Mother Land మాతృభూమి అంటారు. తల్లిని ప్రేమించకుండా దేశాన్ని ప్రేమించినందువలన ఎవరూ గొప్పవారుకారు. తల్లిని మించిన స్వర్గం వేరొకటి లేదు. రామచంద్రుడు "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసి' ' అన్నాడు. "రామా! రామా!" అని స్మరిస్తున్నాము. కాని రాముని ఆదర్శములను విస్మరిస్తున్నాం. రాముని

## భగవాన్ సాయి సందేశం

పూజించటంకంటే రామాజ్ఞను శిరసావహించుతే గొప్ప భక్తులవుతారు. తల్లి మనసును ఏమాత్రం కష్టపెట్టకుండా చూచుకోవాలి. తల్లిని నిరంతరం స్మరిస్తుండాలి. తల్లిని కించిత్ అయినా బాధపెట్టకుండా చూచుకోవాలి. స్వామిది వేయి తల్లుల ప్రేమ అని అంటూంటారు. ఒక తల్లి ప్రేమనే మీరు చూడటంలేదు. వేయి తల్లుల ప్రేమ మీకు ఎట్లా అర్థమవుతుంది? ఒక తల్లినే సంతోషపెట్టటానికి ప్రయత్నించటంలేదు. స్వామిని ఏవిధంగా సంతోష పెట్టగలరు? నీ తల్లిని నీవు సంతోషపెట్టు. స్వామి సంతోష పడుతారు. స్వామికి ఏమీ అక్కరలేదు. అనేకమంది Happy Birth Day... Happy Birth Day అని నాకు వ్రాస్తుంటారు పిచ్చివారు. Happy లేనివారికి Happy చెప్పవచ్చును. నేను ఎప్పుడూ Happyగానే ఉంటున్నాను. మీ తల్లిదండ్రులకు Happy చెప్పండి. ఎందుకంటే, పుత్రవాత్సల్యంచేతను, పుత్రుని అభివృద్ధి నిమిత్తమై అనేకరకములైన సమస్యలతో వారు మునిగి ఉంటుంటారు. అలాంటివారికి Happy.... Happy చెప్పండి. మిత్రులకు చెప్పండి, బంధువులకు చెప్పండి. భగవంతునికి మాత్రం Happy చెప్పనవసరంలేదు. భగవంతుడు ఎప్పుడూ ఆనందస్వరూపుడే. మీ నుంచి నేను ఏమీ కోరను. నాకు

ఏమీ అవసరంలేదు. మీరు ఆనందంగా ఉండండి. మీ తల్లిదండ్రులను ఆనంద పెట్టండి. అదే నాకు ఆనందం.

తల్లిని ప్రేమించండి, తండ్రిని గౌరవించండి తల్లిదండ్రులను సంతృప్తిపరచండి. వారు సంతృప్తి చెందుతే, మీ జీవితమంతా సంతృప్తిగానే నడుస్తుంది. అప్పుడు దైవమే మీకు హస్తగతమైపోతాడు. దైవమును మీరు ప్రత్యేకంగా పిలువనవసరంలేదు. మీరు సత్ప్రవర్తనతో నడుచుకున్నప్పుడు దైవమే మీ దగ్గరకు పరిగెత్తుకుంటూ వస్తాడు. ఈనాడు నీవు పుత్రుడుగా ఉండవచ్చు. ఇంకా కొంత కాలానికి నీవు తండ్రివి కావచ్చును. ఈనాడు నీవు పుత్రికగా ఉండవచ్చు. ఇంకా కొంతకాలానికి నీవు తల్లిగా మారవచ్చు. నీవు తల్లిగా ఉన్నప్పుడు నీ కుమారుడు నిన్ను ప్రేమించకపోతే నీవు ఎంత బాధపడుతావు? నీవు తండ్రిగా ఉన్నప్పుడు నిన్ను నీ కుమారుడు గౌరవించపోతే ఎంతబాధపడుతావు? ఒక్కమాటు ప్రశాంతంగా ఆలోచించుతే కర్తవ్యం బోధపడు తుంది. ఎవరినీ బాధించకు. పరులను నిందించకు. పరులు కాదు వారు పరమాత్ములయా! ఎవరినీ దూషించకూడదు. పరుల దోషములను ఏమాత్రం వెదుకకూడదు. పరుల దోషమును నీవు ఒకటి వెదుకుతే, పరులు నీ దోషాలను నూరు వెదుకుతారు. కనుక ఎవరియందు దోషములు వెదుక కూడదు. అందరినీ ప్రేమించు, అందరిని విశ్వసించు. కాని తల్లిదండ్రులను మాత్రం గౌరవించు, ప్రార్థించు, పూజించు. అదియే నీ జీవితానికి తరగని సంపద. నీకు Wealth (సంపద) కావాలని బాధపడవద్దు. తల్లిదండ్రుల ఆశీర్వాదమే నీ Wealth (సంపద), అదియే నీ Health (ఆరోగ్యం). Health, Wealth తల్లిదండ్రుల ఆశీర్వాద ఫలితమే. తల్లిదండ్రుల సేవయే భగవంతుని సేవ. భగవం తుని దగ్గరకు మనం పోవటంకాదు. భగవంతుడినే మన దగ్గరకు తెప్పించుకోవాలి. ఆ విధమైన శక్తి సామర్థ్యములను మనం సంపాదించుకోవాలి. ఎవరినైనా వదులుగాని తల్లిదండ్రులను మాత్రం వదలకు. వారిని ఆశ్రయించు, ఆరాధించు, వారి ఆశీర్వాదములను నీవు అందుకో. తల్లిదండ్రుల ఆశీర్వాదమును అందుకొని, అభివృద్ధిచెంది జగత్తుకు ఆదర్శవంతమైన విద్యార్థులుగా రూపొందుతారని నేను ఆశిస్తున్నాను, ఆశీర్వదిస్తున్నాను.

*(ది. 19-11-1998 మహిళా దినోత్సవ సందర్భమున భగవాన్ చేసిన ప్రసంగం నుండి)*

## సరస్వతీ నమస్తుభ్యం

అనాదికాలమునుండి భారతదేశమునందు తల్లులను కూడా దైవస్వరూపంగా విశ్వసిస్తూ వచ్చారు. దుర్గా, సరస్వతి- వీరందరూ తల్లులతో సమానమే. వారికి వేరువేరుగా పేర్లుపెట్టుకొనినప్పటికీ, వారందరినీ తల్లులు గానే భావిస్తూ వచ్చారు. సరస్వతియొక్క స్వరూపాన్ని విశ్వసించి, ఆనందించి, అనుభవించాలి. కొంతమంది, కొంతకాలం క్రిందట 'సరస్వతి' పేరు కూడా చెప్పకూడ దని చెప్పారు. ఇదిచాలా అజ్ఞానము. ఇది చాలా అమాయ కత్వం. తల్లితో సమానమైనటువంటి సరస్వతిని విస్మరిం చడం కడుశోచనీయం. సరస్వతిని స్మరించకుండా, ఏ ఒక్క అక్షరమును మనం వల్లించలేం. ప్రాచీన కాలంలో మనఋషులు సరస్వతిని వర్ణించారు.

"సరస్వతీ నమస్తుభ్యం వరదే కామరూపిణి
విద్యారంభం కరిష్యామి సిద్ధిర్భవతుమే సదా
పద్మపత్ర విశాలాక్షీ పద్మకేసరవర్ణినీ
నిత్యం పద్మాలయా దేవీ సామాంపాతు సరస్వతీ"

మన భారతదేశమునకు కూడనూ ఈ సరస్వతి పేరే పెట్టారు. సరస్వతికి 'భారతి' అని పేరు కూడా ఒకటి ఉన్నది. ఈ భారతియొక్క పేరు సరస్వతి పేరే. ఈ సరస్వతి పేరే భారతదేశమునకు పెట్టారుగాని, ఏదో ఒక రాజుపేరుకాదు. దుష్యంతుని కుమారుడైన భరతుని పేరు ఈ దేశమునకు పెట్టారనుకుంటున్నారు. అంతకు పూర్వం ఈ దేశమునకు ఏమిపేరు? ఇవన్నీ తీసుకుంటే దైవము నుంచి వచ్చిన పేర్లే ఇవన్నీ. సరస్వతి పేరు ప్రపంచంలో అన్నింటిలోనూ లీనమై ఉంటున్నది. ఈమెకు 'బ్రహ్మపత్ని' అని ఒక పేరు. బ్రహ్మ అనగా సృష్టికర్త యొక్క అనంతమైన శక్తిని మనం విశ్వసించాలి. సృష్టి కర్తయొక్క దివ్యత్వాన్ని తెలుసుకోవాలి.

(మహిళాదినోత్సవం - ది. 19-11-1998) - బాబా

# సరస్వతీ ప్రార్థన అభ్యంతరకరమా?

మన్నవ గిరిధరరావు

1948లో పండిట్ జవహర్‌లాల్ నెహ్రూగారు విశాఖపట్టణం వచ్చి 'జలఉష' నౌకకు ప్రారంభోత్సవం చేసినపుడు సింహాచలం నుండి వేదపండితులు విచ్చేసి వేదమంత్రాలు చదివి కొబ్బరికాయలు కొట్టడం జరిగింది. అది మనదేశపు ఆచారం.

ఇంగ్లండులో క్రొత్తనౌకను జలప్రవేశం చేయించేటప్పుడు విస్కీ సీసాలు పగులకొడతారు. అది వాళ్ళ ఆచారం.

ఇంగ్లండులో ప్రభువుల సభకు 26మంది క్రైస్తవ మతాధికారులను రాజు నామినేట్ చేస్తాడు. బ్రిటిష్ రాజు యొక్క పట్టాభిషేకాన్ని ఆర్చి బిషప్ ఆఫ్ కాంటర్బరీ నిర్వహిస్తాడు. ఈ కారణంగా ఇంగ్లండును ఎవరూ 'కమ్యూనలిస్టు' దేశంగా వర్ణించరు.

అమెరికాలో సెంటు నోటుమీద "దేవునిలో మేము విశ్వాసముంచుతాము" అని ముద్రించబడి ఉంటుంది. అలా ప్రకటించడాన్ని ఎవరూ మతోన్మాదంగా విమర్శించరు. మానవుల ఋజువర్తనకు దైవవిశ్వాసం అవసరమని వాళ్ళభావం.

భారత రాజ్యాంగం ప్రకారం భారత ప్రభుత్వ సూక్తిగా 'సత్యమేవ జయతే' స్వీకరించబడింది. ఇది ముండకోపనిషత్తులోనిది. జీవిత బీమా సంస్థ సూక్తిగా "యోగక్షేమం వహామ్యహం" తీసుకున్నారు. ఇది భగవద్గీతలోనిది.

కాని, ఇటీవల మనవిద్యామంత్రుల సమావేశంలో విద్యాధిదేవత అయిన సరస్వతీ ప్రార్థన జరిపితే కొందరు అభ్యంతరం చెప్పారు. నినాదాలు చేశారు. వాకౌట్ చేశారు. ఇది సెక్యులరిజానికి విరుద్ధమన్నారు.

ఐరోపాలో రోమన్ విద్యాధిదేవత 'మినర్వా'ను ఆరాధిస్తారు. సరస్వతికి బదులు మినర్వాకు వందనం చేస్తే అది సెక్యులరిజమవుతుందా?

సృష్టికర్తకు వివిధ కార్యకలాపాలు జరగడం కొరకు వాయువు, అగ్ని, వరుణుడు, సూర్యుడు; వగైరా శక్తులు సహకరిస్తుంటాయి. ఆ శక్తులనే దేవతలుగా ఆరాధిస్తుంటాము. వర్షంకొరకు వరుణుని పూజిస్తాము. విద్యాధిదేవతను విద్యామంత్రుల సమావేశంలో ఆరాధిస్తే నేరమా?

ఆంధ్రప్రదేశ్‌లో సాయిబాబా మందిరాలను గూడా దేవాలయాలుగా పరిగణించదలచిన ప్రభుత్వానికి మతంమీద వ్యతిరేకత ఎందుకు? ధ్వజస్తంభంలేని మందిరాలు దేవాలయాలు కావు. ఈ కుహనా సెక్యులరిస్టులకు దేవుడు పనికిరాడు. ఆ దేవుడికి వచ్చే 'డబ్బు' మాత్రం చాల రుచిగా ఉంటుంది.

దేశ విభజన జరిగినపుడు హిందువులు అధిక సంఖ్యాకులుగా ఉన్న రాష్ట్రాలు ఇండియన్ యూనియన్‌లో చేరాయి. కనుక దేశంయొక్క సుస్థిరతకు, సమైక్యతకు హిందూ భావనయే పట్టుగొమ్మ.

"హిందువుల సంఖ్య ఎక్కువగా ఉన్నందువల్లనే భారతదేశం లౌకికదేశంగా కొనసాగుతున్నది." అని బాబ్రీ మసీదు కార్యాచరణ సమితి సభ్యుడు జావేద్ హబీబ్ 1990 డిసెంబరులో అంగీకరించాడు. ఈ సత్యాన్ని ఎల్లరూ అర్థం చేసుకోవడం అవసరం. హిందూ వ్యతిరేకతయే సెక్యులరిజంగా పరిణమించడం విషాదకరం.

# మానవతా విలువలను కాపాడే నిమిత్తమై మేము ఈ జన్మ ఎత్తాం!

"ప్రాచీన ఋషులకు పాఠముల్ చెప్పగ
జాలిన వేదాంత సారమతులు
తమ జీవితంబులు త్యాగంబు చేసియు
సామాజికమును సరిగ తెరచి
వేద శాస్త్ర ఇతిహాస పురాణముల్
ఇంపుగ మెప్పించి నట్టి ఋషులు
సర్వ సర్వం సహా చక్రపాలనమైన నడిపించ గల్గిన నాయకులు
కలరు పెక్కొండ్రు భారత భువిని నేడు
ఉండి ఫలమేమి వారిలో ఒక్కరైన
అనుదినంబును సృజించెడి ఆర్తనాదము
ఆలకింప తలంచరే ఆర్యులారా!"

"ఉత్తిష్ఠత! జాగ్రత్త! ప్రాప్యవరాన్ని బోధత!" విద్యార్థులారా! లెండు! మేల్కొనుడు! లక్ష్యమును సాధించునంత వరకు మీ దీక్షను విరమించ కుండా చూచుకోండి! ఈనాడు కావల్సింది భౌతిక భోగ భాగ్యములు కావు. జీవిత సంగ్రామ రంగము నందు, మహాయోధులై నిలచి, పవిత్రమైన ధీరత్వాన్ని ప్రకటించి, ఆదర్శ వీరులుగా నిలవాలి. విద్యార్థులారా! ప్రాచీన ఋషులు విద్యా రంగమునందు ఏవిధంగా ఆదర్శమును నిరూపించినారో, దానిని ఒక్కసారి విచారించి చూడండి. ధర్మమునకు వారు పట్టాభిషేకం కట్టారు. సత్యమునకు స్వాగతం పలికారు. వీరత్వానికి కంకణం కట్టారు. అట్టి పవిత్రమైన భారతీయ సంస్కృతిని అభివృద్ధి పరచినటు వంటి మహావీరులకు మీరు ప్రతి బింబములుగా నిలవాలి. భారతదేశమునకు వారసులు మీరే. పవిత్రమైన ధర్మ శాస్త్రములను ఉద్ధరించి, దేశమును కళ్యాణనందనం గావించడానికి కంకణం కట్టుకోవటానికి మీరు సిద్ధంగా ఉండాలి.

గత రెండు వందల సంవత్సరాల నుంచి విజ్ఞాన శాస్త్ర రంగంలో విరివిగా ప్రయోగాలు జరుగుతున్నాయి. కాని ఆ విజ్ఞాన శాస్త్రమునకు తగినటువంటి పవిత్రతను మాత్రం వారు చేకూర్చలేదు. ఈ విజ్ఞాన శాస్త్రము భౌతికమైన నాగరికతను మాత్రమే అందిస్తూ వచ్చింది. ఈనాడు దేశమునకు అంతర్నాగరికత అత్యవసరం. భారతదేశమునందు మానవతా విలువలు నశించిన యెడల, ఆధ్యాత్మికమే నశించి పోతుంది, నైతిక విలువలు క్షీణించిపోతాయి, ధర్మానికే హాని ఏర్పడుతుంది, మానవత్వం మంట కలిసిపోతుంది. ఇట్టి మానవతా **విలువలను కాపాడే నిమిత్తమై మేము ఈ జన్మ ఎత్తామనే విశ్వాసాన్ని అభివృద్ధి చేసుకోండి.** సమాజ సంక్షేమాన్ని దృష్టియందుంచుకొని, దేశ కళ్యాణమును దృష్టి యందుంచుకొని, పవిత్రమైన మానవత్వాన్ని అభివృద్ధి పరచే నిమిత్తమై మీరు కంకణం కట్టుకోవాలి.

## భగవాన్ సాయి దివ్య ప్రకటన

భారతీయులు శాంత స్వభావులు, క్షమ వారి సొత్తు. గత చరిత్రను పరిశీలిస్తే, భారతీయులు ఎవరి మీద ఏనాడు నిష్కారణంగా దండెత్తిపోయిన ఉదంతాలు కనిపించవు. ఎందరో విదేశీయులు భారతదేశంపై దండెత్తి వచ్చి, భారతీయుల సౌభాగ్యాన్ని దోచుకొని వెళ్లారు. కాని భారతీయులు అటువంటి దుశ్చర్యలకు ఏనాడూ పాల్పడ లేదు. వారి శాంతము, సౌశీల్యము, సౌజన్యమే దీనికి మూలకారణం. భారతీయులకు దివ్యత్వము, పవిత్రతలు రెండూ రెండు నేత్రములవంటివి. ఆనాడు భారతదేశంలో అన్యాయ, అక్రమ, అసత్య, అనాచారములు అంటే భారతీయులకు ఏమాత్రం తెలియవు. అటువంటి పవిత్ర భారతభూమిలో ఈనాడు విషబీజాలు నాటబడి, ఆందోళనలకు, అల్లకల్లోలాలకు నిలయమై అశాంతికి మూలమై అప్రదిష్ట పాలవుతున్నది.

కేవలం గ్రంథ పరిచయం మాత్రమే చదువులు కావు. ఆచరణతో కూడిన ప్రచార ప్రబోధలు మానవునికి అత్యవసరం. అభ్యసించిన విద్యలను ఆదర్శమైన మార్గంలో సమాజానికి అందించాలి.

*'చదివి వ్రాయ నేర్చిన వారందరూ విద్యావంతులేనా?*
*కాలేజీ డిగ్రీలు పొందిన విద్యావంతులగునా?"*
*ఇట్టి నిత్య సత్యములను మనం ఏనాడో మరచిపోయినాం*
*బ్రతుకుటకే విద్య యన్న బ్రతుకుట లేదే పశుపక్షులు?'*

భారతదేశములోనే గాక, అనేక దేశాలలో కోట్లాది విద్యావంతులున్నారు అయితే ఈ విద్యావంతులు, ఆయా దేశములకు ఏవిధమైన ఉపకారం చేస్తూ వస్తున్నారు? సమాజమునకు వారు ఏ విధమైన సహాయం చేస్తున్నారు? సమాజ సంక్షేమం కోసం వారు ఏవిధంగా ఉపయోగపడు తున్నారు? లేదు...లేదు.... వారి స్వార్థ స్వప్రయోజనాల కోసమే ఈ చదువును ఉపయోగ పెట్టుకుంటున్నారు.

విద్యార్థులారా! ఈ స్వార్థ స్వప్రయోజనములను త్యజించి, పరార్థము, పరోపకారము అనే దీక్షను మీరు పూనాలి. భారతీయ విద్య ఆదర్శవంతమైనది. తన కాళ్ల మీద తాను నుంచోగలిగిన స్వశక్తిని అందించేటటువంటిది. పరోపకారం కోసం ప్రాణాన్ని కూడా త్యజించడానికి ఏమాత్రం వెరువనటువంటి శక్తిని, స్ఫూర్తిని అందించే టటువంటిది భారతీయ విద్య. దయామయులుగా మార్చగలిగేది భారతీయవిద్య. అయితే ఈనాటి విద్య కేవలం మేధాశక్తిని మాత్రం అభివృద్ధి పరుస్తున్నది గాని, హృదయవిశాలతను గురించి ఏమాత్రం విచారించటం లేదు. విద్య హృదయ విశాలతను పెంచేదిగా వుండాలి గాని, శిలాహృదయులుగా మార్చేది కారాదు. త్యాగమైనటు వంటి దేశభక్తి, ప్రేమ మయమైనటువంటి దైవభక్తి ఈ రెండూ విద్యార్థుల రక్తంలో ప్రవహించాలి.

విద్యాసంస్థలు ప్రపంచంలో రోజు రోజుకూ పెరిగి పోతున్నాయి. పల్లె పల్లెలో పాఠశాలలు ప్రారంభిస్తున్నారు. వీధి వీధిలో స్కూళ్ళు పెడుతున్నారు. కేవలం పాఠశాలలు ప్రారంభించినంత మాత్రమున, ప్రతి విద్యార్థి విద్య నభ్యసించినంత మాత్రమున కలిగిన ఫలితమేమిటి? ఏమీ ప్రయోజనం లేదు. విద్యార్థిలో ఉండవలసిన వినయం ఈనాడు కానరావటం లేదు.

*"మేలు చేసిన వానికే కీడు చేయు*
*కూడు పెట్టిన వానినే కూల ద్రోయు*
*విద్య చెప్పిన వానినే వెక్కిరించు*
*ఇదియే ప్రోగ్రెస్ ఈనాడు విద్యయందు."*

అందరూ విద్యావంతులూ. స్కూలుకు వెళ్ళే వారందరూ విద్యార్థులే. కాని ఆ విద్య యందు వుండినటు వంటి పవిత్రమైన, నిత్యమైన, సత్యమైనటు వంటి భావాన్ని గుర్తించినటువంటి వ్యక్తులు ఎక్కడైనా కనిపిస్తున్నారా? మీరు చదివిన చదువులు సార్థకం కావాలంటే, మీరు సమాజంలో ప్రవేశించాలి, సమాజ సేవలలో పాల్గొనాలి, ఈ దేశమును పరిశుద్ధమైన దేశంగా మీరు మార్పు చేయాలి. ప్రతి మానవునిలో మానవతా విలువలను పెంపొందించాలి. మానవుని మానవునిగా పెంచిన ప్రయోజనం లేదు. పరిపూర్ణమానవునిగా తీర్చిదిద్దాలి. అప్పుడే ఈ విద్య సార్థకమవుతుంది.

విద్యార్థులారా! పెద్దలను గౌరవించి, సమాజంలో ఆదర్శమైన జీవితాన్ని మీరు అందించాలి. అప్పుడు మీరు చదివిన విద్యకు తగిన విలువను అందుకున్న వారవుతారు. పెద్ద డిగ్రీలు పొంది, నడతలు చూస్తే విరుద్ధమైనవిగా వుండి నప్పుడు, ఈ డిగ్రీల విలువ ఏమిటి? మార్కులు తెచ్చు కోవటం గొప్పకాదు, రిమార్కులు రాకుండా జాగ్రత్తపడండి. ఈనాడు విద్యార్థికి నూటికి 35 మార్కులు వస్తే ప్యాసై పోతున్నాడు. మిగతా 65 మార్కులు ఏమైపోయి నట్లు? ఒక వ్యక్తికి నూరు పనులు వప్పజెప్పినప్పుడు, 35 పనులు చేసి, 65 పనులు చెడగొడితే అతడు ఎట్లా పాసైనట్లు?

ప్రాచీన విద్య లక్ష్యము నూటికి నూరు శాతం రావాలి. అదియే నిజమైన విద్య. కేవలం మార్కుల కోసమే తాపత్రయ పడకండి. పవిత్రమైన హృదయాన్ని విశాలం గావించుకోవటానికి, విద్య నభ్యసిస్తున్నామనే వివేకాన్ని మీరు అభివృద్ధి పరచుకోవాలి. విద్యతోపాటు వివేకమును సంపా దించు కోవాలి. దేశం యొక్క భవిష్యత్తు విద్యార్థుల మీదనే ఆధారపడి వున్నది.

*"నీతి నియమాలు గ్రంధాల నిలిచిపోయె*

*హృదయమంతయు దుర్గంధ పతనమయ్యె*

*చేతలంతయు స్వార్థంబు చేతలయ్యె*

*ఇదియె ఈనాటి ప్రోగ్రెస్ విద్యలందు"*

నీతి, నియమాలు ఆచరణలో చూపు. గ్రంథములు చదివి ప్రయోజనం లేదు. అదియొక పుస్తకము, ఇదియొక మస్తకము''. మస్తకములో నున్న దానిని అనుభవంలో పెట్టు. ఆచరణలో పెట్టు. జ్ఞానము అనేది అనేక రకములు. 1. Bookish Knowledge (పుస్తక జ్ఞానం) 2. Discrimination Knowledge (విచారణా జ్ఞానం 3. General Knowledge (లౌకిక జ్ఞానం), 4. Practical Knowledge (అనుభవ జ్ఞానము). ప్రతి ఒక్కరూ జనరల్ నాలెడ్జిని అభివృద్ధి పరచుకొని, అనుభవజ్ఞానంలో ప్రవేశించాలి. ప్రతి వ్యక్తికి కామన్ సెన్స్ మరియు జనరల్ నాలెడ్జి చాలా అవసరము. మొట్టమొదట మన జీవితాన్ని సరియైన మార్గంలో పెట్టుకోవాలి. అప్పుడే పదిమందికి ఆదర్శంగా రూపొందుతాము. అదియే 4 Fలు.

*Follow the Master*

*Face the Devil*

*Fight to the End*

*Finish the Game.*

Who is your master? నీ కాన్షస్‌యే నీ మాస్టర్. కనుక నీ కాన్షస్ నే నీవు అనుసరించు. ఈనాటి విద్యార్థులకు ఆత్మ విశ్వాసమే లేదు. ఎప్పుడు ఈ ఆత్మ విశ్వాసము అభివృద్ధి అవుతుంది? త్యాగమయమైనటువంటి దేశభక్తి, ప్రేమమయమైనటువంటి దైవభక్తి - ఈ రెండూ మనలో ఆవిర్భవించినప్పుడే మనలో విశ్వాసం తప్పకుండా అభివృద్ధి అవుతుంది. ఈనాడు ప్రతి ఒక్కరికి Doubts (సందేహాలు)... Doubts... ప్రతి మానవునికి depression... (నిస్పృహ) depression..... ఇది ఏనాడు పోతుందో, ఆనాడే మానవుడు నిజమైన మానవుడుగా రూపొందుతాడు. ఈ depression కు కారణం నీ బలహీనతే. నాయమాత్మ బలహీనేన నలభ్యః "బలహీనులు కాకూడదు. బలహీనులకు ఆత్మ లభించదు. ఆత్మ విశ్వాసం లేనటువంటివాడే బలహీనుడు.

భారతదేశమునందు కావల్సినంత భాగ్యం ఉంటున్నది. దానిని గుర్తించడానికి మీరు ప్రయత్నించటంలేదు. ఏమిటి ఈభాగ్యం? అదియే త్యాగభాగ్యము, అదియే ఆధ్యాత్మిక భాగ్యము, అదియే సేవాభాగ్యం. ఇలాంటి పవిత్రమైన భాగ్యం మన భారతదేశంలో వుండి కూడనూ, నీవు ఎందుకు కాలమును వ్యర్థంచేస్తున్నావు? కాలంవ్యర్థంచేయకూడదు. ప్రతి మానవుని యొక్క దేహంకూడనూ కర్మతో కూడినటువంటిదే. మనదేహం కర్మాచరణనిమిత్తమే వచ్చింది. "శరీరమాద్యం ఖలుధర్మ సాధకమ్". భారతీయ సంస్కృతి యందు ఈసత్యమును మీరుగుర్తించాలి. ఈదేహం ఎందుకు వచ్చింది? ఈదేహమును పదిమందికి సంతోషపెట్టె కార్యక్రమంలో పూర్తిగా సద్వినియోగం చేసుకోవాలి. కడపటివరకు సహాయం ---- సహాయం--చేయాలి. దీనినే మన భారతీయ సంస్కృతియందు "పరోప కారః పుణ్యాయ పాపాయ పరపీడనమ్" అన్నారు. HELP EVER, HURT NEUER. ఆఖరి శ్వాసవరకూ ఇతరులకు సహాయంచేస్తూనే

ఉండాలి. అప్పుడే మన జీవితం సార్థక మవుతుంది. ప్రతి వ్యక్తి పవిత్రమైన ఆదర్శాన్ని చూపాలి. పదిమంది మెచ్చుకునేటటువంటి ఆదర్శాన్ని చూపాలి. పదిమందికి ఆనందాన్ని అందించే ఆదర్శాన్నిచూపాలి. పదిమందిని అభివృద్ధిపరచేటటువంటి ఆదర్శాన్ని చూపాలి. కాని ఈనాడు అటువంటి ఆదర్శం ఎక్కడా కనిపించటం లేదు.

ధనార్జన కోసం మనం ప్రాకులాడకూడదు. ధనార్జన కోసం చదువుతున్నామనుకొంటారు. ఇది చాలా పెద్దతప్పు. మనం చదువుకున్న చదువు సమాజంలో చక్కగా ఉపయోగపడితే ధనం అదంతట అదేవస్తుంది. కాని ఈనాడు విద్యాసంస్థలు ధనమునకై అన్ని విధములైన పాట్లు పడుతున్నాయి.

*"ధనమె దైవంబయ్యె*
*దర్పంబె మతమయ్యె*
*స్వార్థమే జీవికి స్థానమయ్యె*
*ధనము ధర్మంబయ్యె*
*దయను హీనంబయ్యె*
*కపటమే జీవికి కాంతియయ్యె*
*భోగాలు రాగముల్ రోగాల పాలాయె*
*కామాంధులుగ చేసె కలిని చదువు*
*బ్రతుకుఅంతయు బహుబాధ బద్ధమయ్యె*
*ఆలసించిన జగతి ఏగతియునగునో*
*విద్యయందు నైతిక నుంపుగ జేర్చి*
*భారత బిడ్డలని పేరు బడయరయ్యా!"*

మనం చేసే ప్రతి కర్మయందు నైతికవిలువ వుండాలి. నైతికమును ఆదర్శము చేసుకొని మనకర్మలలో మనం ప్రవేశించాలి. అప్పుడే మనం నైతికశక్తి సంపత్తిని సంపాదించగలం.

**ప్రేమస్వరూపులారా!**

ప్రాచీనకాలమునుండి దేశదేశములకు ఆధ్యాత్మిక సంపత్తిని అందించి "లోకాస్సమస్తా సుఖినో భవంతు" అనేదానికి సార్థకం చేసింది భారతదేశం. అట్టి ఆదర్శమును మీరు ఈనాడు పునః ప్రారంభించాలి. గ్రామగ్రామాలలో ప్రవేశించాలి. వాడవాడలో ప్రవేశించాలి. దివ్యమైన, నవ్యమైన భావాలను చాటాలి. ఐకమత్యమును అభివృద్ధి గావించాలి. ఐకమత్యంతో పనిచేయాలి. ఎవరిపైన అసూయ చెందరాదు. 'అసూయ' అనేది నివారణ కాని రోగం. దూషణ భూషణ, తిరస్కార పురస్కారములకు ఏమాత్రం లొంగక, క్రుంగక ముందుకు సాగిపోవటం నేర్చుకోవాలి. ఇవి ప్రతి మానవునికి వస్తునే ఉంటాయి. కాసిన చెట్టుకే రాళ్ళ దెబ్బలు. మంచివారికే యివన్నీ వస్తుంటాయి. వాటిని మనం లెక్క చేయరాదు. చెట్టును రాళ్ళతో ఎందుకు కొడుతున్నారు? పండ్లు వుండటంచేతనే రాళ్ళతో కొడుతున్నారని, చెట్టు ఎంతో ఆనందిస్తుంటుంది. కనుక మనకు ఎవరు అపకారం చేసినా, ఉపకారంగానే భావించుకోవాలి. అటువంటి విశాల హృదయమును మనం పెంచుకోవాలి. ఏ మానవుడు హృదయవిశాలతను పెంచుకుంటాడో, ఆ మానవునియందే నిజమైన దైవత్వం ప్రకాశిస్తుంటుంది.

ప్రాచీన గురుకులాలలో విద్యార్థులు విద్య నభ్యసించి, తమ తమ ఇండ్లకు వెళ్ళేటప్పుడు వారందరిని సమావేశపరచి ఋషులు "మాతృదేవోభవ! పితృదేవోభవ! ఆచార్యదేవోభవ! అతిథిదేవోభవ!"లను గురించి ఉపదేశించి పంపేవారుట. దీనికే ఆనాడు 'స్నాత కోత్సవము' అని పేరు పెట్టారు. విద్య చాలా పవిత్రమైనటువంటిది. విద్యయే దైవస్వరూపము. దానిని ప్రతి ఒక్కరూ నేర్వాలి.

ఈనాడు సైన్సు, టెక్నాలజీ అంటే ఎంతో గొప్పగా భావిస్తున్నారు. వీటిని ఎన్నోవేల సంవత్సరాలకు పూర్వం హిరణ్యకశిపుడు కనిపెట్టాడు. ఈనాడు సైంటిస్టులు చంద్రమండలం వరకే పోయినారు. ఆనాడు హిరణ్యకశిపుడు ధ్రువనక్షత్రం వరకు పోయాడు. అంత గొప్ప సైంటిస్టు అయిన హిరణ్యకశిపుని కుమారుడు చిన్న విద్యార్థి ప్రహ్లాదుడు. "ఓ తండ్రీ లోకములన్నీ ఘడియలో జయించిన నీవు, నీ ఇంద్రియాలను నీవే జయించుకోలేక పోయినావు" అన్నాడు. బ్రిటీష్ ప్రధాని చర్చిల్ "Man has Conquered All, But he has not Conquered himself" అన్నాడు. మానవుడు తననుతాను తెలుసుకోలేదు గాని, బాహ్య ప్రపంచంలో ఎంతో అభివృద్ధిని చేస్తున్నాడు. ఈనాటి ఆధునిక విజ్ఞానం మానవుడ్ని శిలాహృదయుడుగా మార్చివేస్తున్నది. ప్రేమ హృదయంగా మార్చాలి, దయా హృదయంగా మార్చాలి.

రెండు భాగములు హైడ్రోజన్, ఒక భాగం ఆక్సిజన్ కలిసినప్పుడు water తయారవుతుంది. మేము water తయారుచేయటం కనిపెట్టామని సైంటిస్టులు గర్వించవచ్చును. అది గొప్పతనంకాదు. ఆ water ను అందరూ సమానంగా పంచుకోవాలి. అది గొప్పతనం. అందరూ ఆ water ఉపయోగించుకోవటానికి అధికారం కలిగిఉండాలి, అదే నిజమైనటువంటి Right (హక్కు). అయితే ఈనాడు ప్రతివాడు Right కోసం Fight చేస్తున్నాడు. Responsibilities ను మాత్రం విస్మరిస్తున్నాడు. బాధ్యతను తీసుకొనకుండా కేవలం హక్కుల కోసం పోరాడటం సమంజసంకాదు. మన కర్తవ్యాన్ని మనం సక్రమంగా నిర్వర్తించినప్పుడు, హక్కులు వాటంతట అవే మనకు లభిస్తాయి. హక్కుల కోసం ప్రత్యేకంగా పోరాడనవసరంలేదు. నీ కర్తవ్యాన్ని నీవు నిర్వర్తించుకుంటూ పో! అదియే మనకు Right (హక్కు) అవుతుంది. Right కోసం ప్రత్యేకమైన సాధనలు అవసరంలేదు. నీ Duties నీవు చక్కగా చేసుకుంటూపో! Do your Duty, Duty is God. Work is Worship. ఏమిటి నీ Right. పదిమందిని ఆనందపరచటమే నీ Right. కనుక విశాల హృదయంతో పవిత్ర భావంతో, స్వార్థరహిత భావనతో, సర్వమానవులను సంతోష పెట్టడానికి సేవలలో మీరు పాల్గొనాలి. Service is God. The best way to Love God is to Love All, Serve All. అందరినీ మనం ప్రేమించాలి. ఈ సత్యమును మీరు చక్కగా గుర్తించుకొని పెద్దలను గౌరవించి, మంచి మాటలతో జవాబు యివ్వటం నేర్చుకోవాలి. మెత్తని మాటలతో, తీయని మాటలతో అందరిని ఆనందపరచాలి. అదియే నిజమైన భారతీయ విద్య. ఆధ్యాత్మిక తత్త్వాన్ని అందించి, అంతర్ముఖమైన సంస్కృతిని పోషించి, దివ్యత్వమైనటువంటి మానవత్వాన్ని అభివృద్ధి పరచేటటువంటి విద్య ఒక్క భారతీయ విద్య మాత్రమే.

విద్యార్థులారా! సత్యాన్ని అభివృద్ధి పరచండి. సత్యమార్గమునకై సర్వస్వమునూ త్యాగం చేయండి. సత్యాన్వేషణలో మీరు మునగండి. సత్యమే దైవము. సత్య మార్గంలో ప్రవేసిస్తే, సర్వభాగ్యములూ లభ్యమవుతాయి. ప్రేమ మార్గంలో ప్రవేశిస్తే సర్వసంపదలూ లభ్యమవుతాయి. ఎవరు ఏమన్నా నీవు ఏమాత్రం చలించవద్దు. చలించని మనస్సు భ్రమించని దృష్టిని మీరు పోషించాలి త్యాగంలో ప్రవేశించండి. త్యాగంలోనే యోగం ఉన్నది. నిజమైన యోగం త్యాగమే. దానికోసం మీరు పాటుపడండి. మొదట తల్లిదండ్రులను సంతోషపెట్టండి. తోటి మానవులను సాటి మానవులుగా గౌరవించండి, ప్రేమించండి.

*(ది. 22-11-1998న ప్రశాంతి నిలయంలో శ్రీ సత్యసాయి డీమ్డ్ యూనివర్శిటీ స్నాతకోత్సవ సభలో భగవాన్ సాయి చేసిన దివ్యప్రసంగం నుండి)* ✳

# శ్రీ మల్లికార్జునుడు

ఈ జ్యోతిర్లింగం ఆంధ్రప్రదేశ్‌లోని కృష్ణానదీ తీరంలో శ్రీశైల పర్వతం మీద వుంది. ఈ పర్వతాన్ని 'దక్షిణ కైలాసం'గా పేర్కొంటారు. ఇంకా ఈ పర్వత మాహాత్మ్య ఔన్నత్యాల వర్ణనం సవిస్తరంగా మహా భారతం, శివపురాణం, పద్మపురాణం మొదలైన ధార్మిక గ్రంధాల్లో చేయబడింది.

పురాణాల్లో ఈ జ్యోతిర్లింగ గాధ ఈవిధంగా పేర్కొనబడింది - ఒకసారి శంకరభగవానుని యిరువురు పుత్రులూ గణపతి, కుమారస్వాములు వివాహంకోసం పరస్పరం పోట్లాడుకోసాగారు.ముందు నా వివాహమే జరగాలని ఎవరికి వారు పట్టుబట్టారు. వారి పోట్లాట కొట్లాటలు చూసి మాతాపితరులైన పార్వతీ పరమేశ్వరులు - "మీరిద్దరిలో ఎవరుముందుగా సమస్త భూమండలాన్ని చుట్టి వచ్చి ముందుగా ఇక్కడికి చేరుకుంటారో వారి వివాహం ముందుగా చేయబడుతుంది." అని అన్నారు. మాతా పితరుల మాటవిని కార్తికేయుడైన కుమారస్వామి వెను వెంటనే పృధ్వీ ప్రదిక్షణకు పరుగులు తీశాడు. కానీ గణపతికి మాత్రం ఇది చాలా కష్టకార్యము. ఒకటి ఏమిటంటే, ఆయనది స్థూలకాయం. ఇక రెండవది ఆయన వాహనం కూడ మూషికం గదా మరి ఆ పరుగులో కుమార స్వామితో సమానుడు ఎలా అవుతాడు. కానీ వినాయకుడు ఎంత స్థూలకాయుడో, ఆయన బుద్ధి అంత సూక్ష్మమైనది, తీక్షణమైనది. ఆయన జాగుచేయకుండా భూప్రదక్షిణకు ఒక సులభోపాయాన్ని కనిపెట్టాడు. ఎదురుగా కూర్చున్న మాతా పితరులకు పూజచేసి ఆపైన వారికి ఏడు ప్రదక్షిణలు చేసి, భూప్రదక్షిణ కార్యాన్ని పూర్తిచేశాడు. అతని కార్యము శాస్త్రామోదితమైనది.

శ్లో॥ *పిత్రోశ్చ పూజనం కృత్వా ప్రక్రాంతించ కరోతియః*
*తస్యవైపృథివీ జన్యం ఫలం భవతి నిశ్చితం ॥*

సమస్త భూమండలాన్ని చుట్టి కుమారస్వామి తిరిగి వచ్చేసరికి గణేశుడికి సిద్ధి, బుద్ధి అనే పేరుగల ఇరువురు కన్యలతో వివాహం అయిపోయింది. వారికి క్షేమం, లాభం అనే ఇరువురు పుత్రులు కూడా కలిగారు. ఇదంతా చూసిన కుమారస్వామి కృద్ధుడై క్రౌంచ పర్వతం మీదకు వెళ్ళిపోయాడు. అది చూసి పార్వతీమాత ఆయన అలక తీర్చడానికి అక్కడకు చేరింది. ఆ వెనుకనే శంకరుడు కూడా అక్కడకు చేరి, జ్యోతిర్లింగ రూపంలో వెలిశాడు. నాటి నుండి మల్లికార్జున జ్యోతిర్లింగ నామంతో ప్రఖ్యాతుడయ్యాడు. ఈయన అర్చన ప్రప్రధమంగా మల్లికా పుష్పాలతో చేయబడింది. మల్లికార్జున నామం ఏర్పడడానికి యిదే కారణం.

**శ్రీ జోస్యుల రామచంద్రశర్మ**

మరో గాధకూడాయిలాఏర్పడింది. - ఈ శైల పర్వత సమీపంలోనే ఒక సారి చంద్రగుప్తమహారాజు యొక్క రాజధాని వుండేది. ఒకానొక విపన్నివారణార్థం ఆయన కుమార్తె ఒకతె అంతఃపురాన్ని వీడి, పర్వత రాజాశ్రయాన్ని పొంది, గోపకులతో పాటు నివసించసాగింది. ఆకన్యవద్ద మహాశుభ లక్షణ, సుందరమైన శ్యామ ధేనువుంది. (నల్లని ఆవు) ఆ గోక్షీరాన్నిరాత్రివేళల్లో దొంగ ఎవరో పితుక్కు పోతుండేవారు. ఒకరోజున దైవ ఘటనగా ఆ రాజకన్య దొంగ పాలు పితుకుతుండగా చూసింది. కృద్ధురాలై ఆమె ఆ దొంగపైపు పరిగెత్తింది. కానీ గోవు వద్దకు పరిగెత్తి చూసేసరికి, అక్కడ శివలింగం తప్ప మరొకటి కనపడలేదు. ఆ రాజకుమారి కొంతకాలమయ్యాక, ఆ శివలింగం మీద ఒక విశాల దేవాలయాన్ని నిర్మింపచేసింది. ఆ శివలింగమే మల్లికార్జున నామంతో ప్రసిద్ధమైంది. శివరాత్రి పర్వదినాన యిక్కడ మహా మహోత్సవం జరుగుతుంది.

ఈ మల్లికార్జున శివలింగం గురించి, తీర్థ క్షేత్రాన్ని గురించి పురాణాల్లో అత్యంత మహిమోపేతంగా పేర్కొన బడింది. ఇక్కడకు విచ్చేసి, యిక్కడి శివలింగాన్ని దర్శించి, పూజలు, అర్చనలు చేసే భక్తుల సకల, సాత్విక, మనోవాంఛలన్నీ సంపూర్ణంగా నెరవేరుతాయి. వారికి శివభగవచ్చరణాలపై స్థిర ప్రీతి కలుగుతుంది. దైహిక, దైవిక, భౌతికమైన అన్ని విధాల బాధల నుండి వారు విముక్తులౌతారు. శివభగవానునిపై భక్తిమనుష్యులకు మోక్ష మార్గగామి.

జన్మదినోత్సవ సందేశం



# హృదయాలను పవిత్రం గావించుకోండి! దివ్యప్రేమను పెంచుకోండి!

ఖండఖండాంతర ఖ్యాతినార్జించిన
మహనీయులనుగన్న మాతృభూమి.
పాశ్చాత్య వీరుల పారద్రోలించి
స్వాతంత్ర్యమును గన్న సమరభూమి
పాండిత్యమున చాల ప్రఖ్యాతి గాంచియు
ప్రతిభ చూపించిన భరతభూమి
సంగీత సాహిత్య శాస్త్రీయ విద్యల
ధీశక్తి చూపిన దివ్యభూమి
చిత్రకళలతోడ చిత్రమైనయున్నట్టి
భరతభూమి యందు జననమంది
భరతమాత ధర్మ భాగ్యంబు కాపాడ
బాధ్యతంతయు మీదె భక్తులారా!"
భానుతేజముకంటే భాసిల్లుచుండును
మంచు తెలుపు కంటె మించి యుండు
ఆకాసము కంటే అతి సూక్ష్మమై యుండు
సర్వజీవులలోన పర్వియుండు
పరమాత్మ లేనిది పరమాణువును లేదు
ఇంతకన్నను వేరెద్ది ఎరుకపరతు

ప్రేమస్వరూపులారా!

భారతదేశము ఆధ్యాత్మిక తత్త్వమునకు, దాన ధర్మములకు పుట్టినిల్లు. అహింసకు, శాంతికి మెట్టినిల్లు. భారతీయులకు ఉండినటువంటి సత్యవ్రతము, మరే దేశీయులకు లేదని చెప్పవచ్చును. పవిత్ర సత్పురుషులు జన్మించిన భూమి ఈ భరతభూమి. ఆదికవి వాల్మీకి పుట్టిన భూమి ఈ భరతభూమి. అనేక సంవత్సరాలు ధర్మ పరిపాలన చేసిన రాముడు ఏలిన రాజ్యభూమి ఇది. కృష్ణుడు బోధించిన గీతాభూమి ఇదే. ఆత్మకు, పరమాత్మకు ఉండినటువంటి జీవతత్త్వాన్ని గుర్తించినటు వంటి భూమి ఈ భరతభూమి. వ్యక్తి, సమిష్టి యొక్క సమత్వాన్ని బోధించినటువంటిది ఈ భరతభూమి. ఇట్టి పవిత్రమైన భూమి, ఇట్టి త్యాగమయమైన, ఇట్టి ధర్మమయ మైన, ఇట్టిశాంతివంతమైన భూమి మరెక్కడా కానరాదు.

భరతభూమిగాలియందు సత్యమున్నది. భరత భూమి ధూళియందు ధర్మమున్నది. భరతభూమి నేల యందు కరుణ ఉంటున్నది. భరతభూమి గంగయందు ప్రేమ ఉన్నది. ఇక్కడి ప్రతి మానవుని హృదయము క్షమా హృదయమే. ఇట్టి పవిత్రమైన, దివ్యమైన, భవ్యమైన, నవ్యమైన గుణములు ఒక్క భారతదేశమునందు మాత్రమే కనిపిస్తున్నాయి.

## భగవాన్ సాయి దివ్య సందేశం

భగవంతుడు సర్వత్రాఉండినటువంటి సర్వశక్తి మయుడు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అన్నారు. అదే విధముగనే ఈనాటి విజ్ఞాన విధానమును చక్కగా విచారించినప్పుడు ఆధ్యాత్మికమునకు, విజ్ఞానమునకు ఎట్టి బేధము కనిపించటంలేదు. ప్రపంచమంతయూ విద్యుత్ మయమై ఉంటున్నది. ప్రపంచమంతయునూ లేజర్ మయమైఉంటున్నది. ప్రపంచమంతయునూ రేడియో మయమైఉంటున్నది. ప్రపంచమంతయునూ కాంతి మయమై ఉంటున్నది. ప్రపంచమంతయునూ ఉష్ణమయమై ఉంటున్నది. కనుకనే భగవత్ స్వరూపము సర్వత్రా వ్యాపించినట్లుగానే, ఈ సైన్సు యొక్క ప్రభావం కూడా సర్వత్రా వ్యాపించినట్లు మనకు బోధపడుతున్నది.

ప్రతి మానవుడు త్రాగునీటియందు, తిను తిండియందు ప్రతి విషయమునందు దివ్యత్వం వ్యాపించి యున్నది. ప్రపంచంలో అయస్కాంతం లేని తావు ఎక్కడా కనిపించదు. అయస్కాంతమనగా ఏమిటి? కేవలం ఒక లోహం, మరొక లోహమును ఆకర్షించునదని భ్రమిస్తుంటారు. కాదు...కాదు.... అయస్కాంతములేని

ఒక్క స్థానం కూడా మనకు కనిపించదు. తల్లి,బిడ్డకు అయస్కాంతము. బిడ్డకు తల్లి అయస్కాంతము. భార్యకు, భర్త అయస్కాంతం. పశువుకు గడ్డి అయస్కాంతం. తుమ్మెదలకు పూవులు అయస్కాంతం. ఈవిధంగా విచారణ చేస్తూపోతే, సర్వమూ అయస్కాంత మయంగానే కనిపిస్తున్నది. కనుకనే ప్రతి మానవుని యందు కూడనూ అయస్కాంతమనేది అనేక రూపములు ధరిస్తున్న . దీనినే వేదాంతము నందు **'రమేతి ఇతిరామః'** అన్నారు. రమింపజేసేటటువంటివాడు రాముడు. ప్రపంచంలో ఎక్కడ చూచినా ఈ ఆకర్షణశక్తి ఉంటున్నది. మనకు కనిపించేటటువంటి వస్తువునకు, కనిపించనటువంటి వస్తువునకు మధ్యనున్నటువంటి దివ్యత్వమనే శక్తియే ఈ అయస్కాంతం. దీనినే 'దైవాకర్షణశక్తి' అని వేదాంతులు చెబుతూవచ్చారు. సైన్సుకందని అతీతమైన శక్తిగనుకనే దీనిని 'సైకోటానిక్' అన్నారు. అంతేకాదు 'బయోకాస్మిక్' అనికూడా అన్నారు. ఇలాంటి పవిత్రమైన దివ్యశక్తికి అనేక నామములు పెట్టుకొని సైంటిస్టులు అనుభవిస్తున్నారు, అనేక రూపములు ధరించి వేదాంతులు అనుభవిస్తున్నారు. అంతర్ముఖమైన...వంటి దివ్యత్వమునకు, బహిర్ముఖమైనటువంటి బహిర్తత్వమునకు- ఈ రెండింటికి మధ్యనున్నటువంటిదే 'దైవత్వము' అని భావిస్తూ వచ్చారు వేదాంతులు. సైంటిస్టులు దీనిని 'సూపర్ పవర్' అన్నారు. పేర్లు వేరుగాని 'దివ్యశక్తి' ఒక్కటే. ఈ జగత్తునందు అనేక చిత్రవిచిత్ర వస్తువులు ఉన్నాయి. ఒక్క మానవ దేహము నందే మనం గమనించని శక్తులు ఎన్నియో ఉంటున్నాయి. వీటినే 'అతీతశక్తులు' అన్నారు. 'అజ్ఞానశక్తులు' అన్నారు. కాని దీనిని అందరూ అర్థం చేసుకోలేరు. మానవునికి 'అతీతమైనశక్తులు' లేవని లోకంలో కొందరు భావిస్తుంటారు. ఇది చాలా తప్పు. ప్రతి వ్యక్తి యందు, ప్రతి ప్రాణియందు ఈ దివ్యమైన శక్తులు ఉంటున్నాయి. కనుకనే నేను అప్పుడప్పుడు 'దివ్యాత్మ స్వరూపులారా!' అని సంబోధిస్తుంటాను. మన దేహంలోని ప్రతి అణువు, ప్రతి కణము దివ్యత్వంతో కూడినటు వంటిదే. ఏ డాక్టర్లూ దీనిని సరియైన పరిశీలన, పరిశోధన చేయలేకపోతున్నారు. ఒక చిన్న ఉదాహరణ.

నాలుక ఉన్నది. దీనిలో నలభైవేల 'టేస్ట్‌బడ్స్' ఉంటున్నాయి. ఒక్క నాలుక మీద మాత్రమే నలభైవేల రుచికరమైన 'బడ్స్' ఉంటున్నాయంటే, ఇది ఎంత విచిత్రము. ఆ ఒక్క నాలుక యందు ఇరుపై ఐదువేల 'హీట్ జనరేటర్స్' ఉంటున్నాయి. మన కన్నులు ఉన్నాయి. చూడటానికి ఒక్క అంగుళం పరిమాణమే ఉంటున్నాయి. ఈ కన్నుల యందు పదమూడు కోట్ల కాంతి కిరణాలు (Light Waves) ఉంటున్నాయి. ఇది ఎవరు సృష్టిచేశారు? ఇది కేవలం అతీతమైనటువంటి దివ్యత్వంతో కూడినటువంటివే. ఈ విధంగా ప్రతి అంగమునూ విచారిస్తూపోతుంటే, సర్వత్రా ఉండినటువంటిది 'దివ్యత్వమే'. ఇలాంటి దివ్యత్వమును లేదని వాదించడం ఎంతో వెర్రితనం. వారు చూడలేకపోయినా, ఉన్న శక్తులు ఎక్కడికీ పోవు. కాని ఈ సత్యమును గ్రహించలేనివారు లేదు... లేదు..... అని అంటుంటారు. తనయందే ఉన్నటువంటి దివ్యత్వాన్ని మానవుడు గుర్తించలేకపోవటం వెర్రితనం కాదా? తెలియనప్పుడు తెలియదని ఒప్పుకోవడం ఉత్తమం. తెలియని విషయం లోపల తెలిసినట్లు నటించడం వెర్రితనం. చక్కగా విచారిస్తే ప్రతి అణువు భగవత్ తత్త్వమే. శరీరంలోని ప్రతికణం భగవత్ తత్త్వమే. మన దేహంలో అనేక 'సెల్స్' ఉంటున్నాయి. కొన్ని కోట్లు ఉంటున్నాయి. ప్రతి 'సెల్'నందు నీ రూపం ఉంటున్నది. ఇలాంటి పరిస్థితిలో దైవత్వం లేదు.... లేదు.... అనటానికి ఎవరికి అధికారం ఉన్నది? తెలియని మూర్ఖుడు అనాలిగాని, చక్కగా విచారణ చేసిన విజ్ఞాని ఎవడూ చెప్పలేదు. "ముండే ముండే మతిర్భిన్న" తలలు వేరు, తలంపులు వేరు. కనుక ఒక్కొక్క తలయందు ఒక్కొక్క విశ్వాసం ఉంటుంటుంది.

***"No' యనువారికి 'No" అనురా***
***'Yes' యనువారికి 'Yes' అనురా***
***No, Yes లు మననోటికేగాని***
***సాయికి సర్వం Yes! Yes!"***

ఇది కేవలం నీ Tongue (నాలుక)కు మాత్రమే సంబంధించినటువంటిది. కాని హృదయానికి సంబంధించినటువంటిదికాదు. ఈ హృదయపవిత్రతను చక్కగా

విచారించి చూచినప్పుడు, ఎక్కడ చూచినా దైవతత్వమే దేహంలో ఏ భాగం వెతికినా దైవత్వమే. కాని అవి రూపకంగా మనకు కనిపించటంలేదు. రూపకంగా లేక పోవటం వలన లేదని భావిస్తున్నాం. ఢిల్లీ రేడియో స్టేషన్‌లో మాట్లాడుతున్న విషయాలు సర్వత్రా వ్యాపిస్తు న్నాయి. కాని కనిపించుచున్నవా? లేదు. రేడియోలో ఆ ఢిల్లీస్టేషన్‌ను 'ట్యూన్' చేస్తే తక్షణమే అక్కడ వినిపిస్తుంది. అదే విధంగా ప్రతిమానవుని దేహం ఒక కంప్యూటరే. ఈ దేహమనే కంప్యూటర్ లోపల అనేక విషయాలు దాచబడ్డాయి. మానవుని దేహమంతా ఒక రేడియోనే. అనేక విద్యుత్ తరంగములు, శూన్యము నుంచి తీసుకొని, తన దేహము నందు దాచుకున్నాడు. మన మైండ్ టెలివిజనే. అనేక రకములైన రూపనామములు, భూత భవిష్యత్తులు తన దృష్టియందుంచుకున్నాడు. కనుక ప్రతి మానవ దేహము ఒక విద్యుత్ జనరేటరే.

ఐన్‌స్టీన్ చెప్పాడు. ప్రతి వస్తువూ అది వస్తువుగా కనిపించటంలేదు. కొన్ని సంవత్సరములకు అది క్రమ క్రమేణా శక్తిగా మారిపోయి, అన్ని వస్తువులు, అన్ని పదార్థ ములు, అన్ని ప్రదేశములు, అన్నింటియందును కూడను శక్తిమయమైఉంటున్నది. సైంటిస్ట్ న్యూటన్ చెప్పాడు. శక్తికి పుట్టుకలేదు. దీనికి నాశనంలేదు. దీనిని ఎవరూ పుట్టించడానికి వీలుకాదు. దీనిని ఎవరూ నాశనం చేయ టానికి వీలుకాదు. అయితే ఒకదానినుంచి ఒకటి మార్పు చేయవచ్చునన్నాడు. ఎట్లా మార్పుచేయ వచ్చును? అయ స్కాంతము నుంచి విద్యుచ్ఛక్తిగా మార్చవచ్చును. ఈ విద్యుచ్ఛక్తి నుంచి అణుశక్తిగా మార్చవచ్చును. ఈ అణుశక్తి నుంచి కాంతి శక్తిగా మార్చవచ్చును. ఈ కాంతి శక్తి నుంచి ఉష్ణశక్తిగా మార్చవచ్చును. ఈవిధంగా ఒకే అయ స్కాంతమును అనేక రూపనామ ములుగా మార్చ బడును. ఈవిధంగా ఒకే అయస్కాంత మును అనేక రూపనామ ములుగా మార్చవచ్చునుగాని, దీనిని నాశనం చేయడానికి ఎవరితరమూ కాదు. దీనినే వేదాంతులు అనేక విధములుగా బోధిస్తూవచ్చారు.

"చావు పుట్టుకలేని శాశ్వతుండు
ఆది మధ్యాంతరహితుడనాదివాడు
తాను చావక పుట్టక చంపబడక
అంతటననుండునట్టి ఆ సాక్షివిభుడే."

దీనినే ఆనాటి 'న్యూటన్' కూడా చెప్పాడు. కాని ఈనాటి చిల్లర చిల్లర సైంటిస్టులు దీనిని సరియైన రీతిలో అర్థం చేసుకోవటంలేదు. వారు తెలుసుకున్నది స్వల్పము, అల్పము. కాని అంతా తెలుసుకున్నట్లు మాట్లాడు తుంటారు.

మోక్షప్రాప్తికోసం ప్రయత్నం చేస్తుంటారని నిన్న వాజ్‌పాయి చెప్పాడు. మోక్షమంటే ఏమిటి? మోహక్షయమే మోక్షం. అంటే ఏమిటి? వాయువు వాయువులో చేరినప్పుడు లీనమైపోతుంది. నీరు, నీరులో చేరినప్పుడు ఏకమైపోతుంది. అగ్ని అగ్నిలో చేరినప్పుడు కలిసిపోతుంది. అదే విధముగనే భగవంతుడు జ్యోతి స్వరూపుడు. నీవు జ్యోతిగా మారు. అప్పుడు దాంట్లో ఏకమైపోతావు. భగవం తుడు రూపరహితుడు. కనుక రూపతత్త్వంపై నీ భ్రాంతిని వదిలిపెట్టు. అప్పుడు నీవు ఏకమైపోతావు. దేహాభిమానం కలిగినటువంటి మానవునికి, ఆత్మాభిమానం ఎట్లా అర్థమవుతుంది? కనుక ఆత్మతత్త్వంపై నీ మనసును కేంద్రీకరించు. అప్పుడే ఆత్మ, ఆత్మ ఏకమైపోతుంది. ఈ ఏకత్వాన్నే 'సాయుజ్యము' అన్నారు. ఇదే **"ఏకాత్మ సర్వభూతాంతరాత్మ"**. ఉన్నది ఒక్కటే. అనేకమంది అనేక రూపనామములుగా భావిస్తూంటారు. కాని ఆత్మతత్త్వం ఒక్కటే. అందరియందు ఉన్నటువంటిది అది ఒక్కటే. దానినే 'కాన్షస్' అన్నారు. ఇది 'కాన్షస్‌నెస్' నుంచి వచ్చింది. దీనిని ఏసైంటిస్టు అయినా, నాస్తికుడైనా అంగీకరించక తప్పదు. బెలూన్సు రంగులువేరు, సైజులు వేరు. కాని దానిలో ఊదినగాలి ఒక్కటే. బెలూన్‌లో చేరినగాలి బెలూన్ రూపాన్ని పొందుతుంది. కాని బెలూన్‌లోలేని గాలి సర్వత్రా వ్యాపించి ఉంటుంది. సర్వత్రా వ్యాపించినటువంటి గాలియే 'కాన్షస్‌నెస్'. బెలూన్‌లో చేరినగాలి 'కాన్షస్'. ఈ 'కాన్షస్', 'కాన్షస్‌నెస్'గా మారాలంటే ఏమిచేయాలి? బెలూన్ లోని గాలి అనేకంగా ఊదుతే అది పగిలిపోయి, దానిలోని గాలి, సర్వత్రా ఉండినటువంటి గాలిలో ఏకమై పోతుంది. కనుక దేహాభిమానం మీద ఉండే ప్రేమను, సర్వాభిమానంగా మార్చుకో. అప్పుడు దైవము, నీవు రెండూ

ఒక్కటే. ఇది కేవలం Quantity లో తేడాగాని Quality ఒక్కటే. ఉదాహరణకు సముద్రం చూస్తే చాలా పెద్దదిగా కనిపిస్తుంది. కాని ఆ సముద్రంలోని నీరును ఒక గ్లాసులో తీసుకొనివస్తే, అది తక్కువగా కనిపిస్తుంది. Quantity లో తేడాగాని ఆ సముద్రములో నీరు Taste (రుచి), నీ గ్లాసులోని నీరు Taste (రుచి) ఒక్కటే. ఈ Taste యొక్క ఏకత్వాన్ని తెలుసుకోలేక మానవుడు జీవితాన్ని Waste (వృధా) చెస్తున్నాడు. మానవత్వంలో దైవత్వం ఒక ఆకర్షణ శక్తియే. ఒక చిన్న ఉదాహరణ. ఇన్ని వేలమంది ఇక్కడకు వచ్చారు. నేను ఎవరికి ఆహ్వానం పంపలేదు. రమ్మనమని కోరలేదు. అయినప్పటికీ వచ్చారు. దీనికి కారణం? ఈ దేహంపై ఆదేహములకు ఉన్నటువంటి ప్రేమ యొక్క ఆకర్షణయే ఈ అనురాగమునకు మూలకారణం. ఇది ప్రేమ యొక్క ఆకర్షణే. అదే Divinity (దివ్యత్వం). అదే Divine Magnet. అదే నిజమైన అయస్కాంతం. ఇది అందరియందూ ఉంటున్నది. ఇది ఎవరియందు అధికంగా ఉంటుందో, వారు అందర్ని ఆకర్షిస్తుంటారు. ఇది ఏవిధంగా అభివృద్ధి చేసుకోవచ్చును? ప్రేమ చేతనే. I

చీకటితో లేచిచెంబులు కంచాల
చిఱ్ఱుముఱ్ఱాడెడి చెలువం తనము
ఇల్లు వాకిలిదిద్ది ఇలవేల్పుగా మారి
అందరి సమదృష్టి నరయుతనము
పిల్లల నవరించి పెందలకడవండి
వడ్డింప నేర్చిన వరవుతనము
రుచుల నేర్పాటులో ఆోటితోనైనను
పోరాడ నేర్చిన బోటితనము
ఆొమ్మదుమ్మగ ధర్మనిరూఢి నెఱపి
కష్ట సుఖముల తోడౌచు కలిమిబలిమి
దండి పండించు మగవాని గుండెకాయ
సతిని దలపక నీ బండి సాగునొక్కో!

- ఇక్కుర్తి ఆంజనేయులు

.. You are One...... I and You are One..... అనుకుంటూపోతే, ఆఖరికి ఏమవుతుంది. I and You are not One--- I and You are We అయిపోతుంది. కనుక మనం ఏకత్వంలో పోవాలి. దివ్యత్వంలో మనం ప్రయాణం చేయాలి. ఐకమత్యంలో మనం ఆనందాన్ని అనుభవించాలి. ప్రేమతత్వంతో జీవితాన్ని గడపాలి.

మానవునిలో ఎన్నియో శక్తులు ఉంటున్నాయి. ఒక చిన్న ఉదాహరణ Hair Brush (హెయిర్ (బ్రష్) వేరు. ఇది నేను పూర్వం East Africa పోయినప్పుడు డా॥ పటేల్ ఒక Hair Brush ను నాకు యిచ్చాడు. ఎందుకంటే ఆఫ్రికన్లకు కూడా నాకు ఉన్నటువంటి జుట్టే ఉంటుంది. మన భారతదేశంలోవున్న బ్రష్‌లు నా జుట్టులో పెడితే విరిగి పోతాయి. ఆ బ్రష్‌కు Iron Rods (ఇనుప ఊచలు) ఉంటాయి. నా వెంట్రుకలయందు ఎంతశక్తి ఉన్నదో, నేను ఈనాడు వెల్లడి చేస్తున్నాను. బ్రష్ తీసుకొని చేతులో పట్టుకుంటే చాలు, వెంట్రుకలన్నీ దానికి కరచు కుంటాయి. దీనిని మా పిల్లలు కూడా చూచారు.ఎందుకు వెంట్రుకలు ఆవిధంగా వచ్చి బ్రష్‌ను కరచుకుంటున్నాయి? అనగా ~దేహమంతా కూడను ఒక Divine Energy గానే ఉ...న్నది. ఇదే అయస్కాంతశక్తి. అయస్కాంతశక్తి అనేది సి... ...పర్యంతం ఏకంగానే ఉంటుంటుంది. ఆ దివ్యశక్తి ఇంతమంది ఆకర్షణకు మూలాధారమైంది. ఆ దివ్యశక్తి సంబంధించినటువంటిదే దివ్యప్రేమ. నా ప్రేమయే నా పెద్ద ఆస్థి. అందువలననే నేను అప్పుడప్పుడూ చెబుతుంటాను.

*"Love is My Form*
*Truth is My Breath*
*Bliss is My Food*
*My Life is My Message*
*Expansion is My Life*
*No season for Love*
*No Reason for Love*
*No Birth - No Death"*

ఆ దివ్యశక్తికి Birth (పుట్టుక) లేదు, Death (చావు) లేదు. ఈ దేహమునకు రావచ్చును, పోవచ్చును.

ఆత్మతత్త్వానికి మాత్రం చావుపుట్టుకలు లేవు. దానికి ఏవిధమైన ఆకర్షణలేదు. దానికి ఒక Reason లేదు, ఒక Season లేదు. కనుకనే ఈనాటి మానవత్వంలో ఉండినటువంటి దివ్యత్వానికి ఈవిధమైన పవిత్రత చక్కగా విచారించి చూచినప్పుడు, దైవత్వమనేటటువంటిది ఒక్క క్షణంలో మనకు అర్థమైపోతుంది. నీయందు కూడనూ అంతే. మీ హృదయాలను పవిత్రం గావించుకోండి. దివ్యమైన ప్రేమను పెంచుకోండి. ఒక్క క్షణంలో మీలో కూడా కాంతి ఆవిర్భవిస్తుంది. నీ Reflection, నీ Reaction, నీ Resound అంతాకూడనూ దివ్యమైన రూపాన్ని ధరిస్తుంది. కనుక ఒకరు పొగిడితే నేను పెరగను. ఒకరు తెగడితే నేను క్రుంగను. పొంగి, క్రుంగనటువంటి ఏకత్వమే నాయందువున్నటువంటిది. దూషణ, భూషణ, తిరస్కారములకు నేను ఏ మాత్రం మార్పు చెందను. దానికీ ఆనందమే. దీనికీ ఆనందమే. నాయందున్నది ప్రేమనే. ఈ ప్రేమను ఇచ్చుకోవటమేగాని, పుచ్చుకోవవటమనేదేలేదు. ఈ ప్రాపంచిక ప్రేమకు, దివ్యమైన ప్రేమకు ఉన్నటువంటి వ్యత్యాసమును గుర్తించాలి. ప్రాకృతమైన ప్రేమ పుచ్చుకొనేదేగాని, ఇచ్చు కొనేదికాదు. కాని భగవత్ ప్రేమ ఇచ్చుకొనేదేగాని, పుచ్చు కొనేది కాదు. నా ప్రేమతత్త్వం ఇవ్వటమే... ఇవ్వటమే... ఇవ్వటమే.... అదే నా తత్త్వం కావటంవలననే ఇంత విశాలమైన, ప్రేమగా పెరిగిపోతున్నది. **"అణోరణీయాన్ మహతో మహీయాన్"**. చిన్న విత్తనమును భూమిలో నాటితే, అది ఒక మొక్కగా మొలచి, పెద్దదై కొమ్మలతో, రెమ్మలతో పెద్ద వృక్షంగా రూపొందుతుంది. అయితే ఈ కొమ్మలు, రెమ్మలు, ఆకులు, పూలు, కాయలు అన్నీ ఈ బీజము లోనివే. ప్రతి రూపనామములు ఆ బీజమునందే ఉంటు న్నాయి. కాబట్టి Love is God, Live in Love. మీరు కూడనూ ప్రేమను పెంచుకోండి. అందరినీ ప్రేమించండి. అది ప్రాకృతమైన ప్రేమకాదు. దివ్యమైనటువంటి హృదయప్రేమ. అప్పుడే నీలో కూడా ఈ దివ్యత్వమనేటటువంటిది వెలువడుతుంది, అది ఆవిర్భవించేటటువంటిది కాదు, ప్రత్యక్షమవుతుంది. దీనినే Self Realisaton అన్నారు. ఇది ఎలా వస్తుంది? మొట్టమొదట Self Confidence ను పెంచుకోవాలి.

**Self Confidence is the Foundation**
**Self Satisfaction is the Wall**
**Self Sacrifice is the Roof**
**Self Realisation is the Life.**

అన్నీ Self లో ఉంటున్నాయి. Self అంటే ఆత్మ తత్త్వం. కనుక ఈ ఆత్మభావముచేతనే ఆధ్యాత్మిక తత్త్వంలో మనం ప్రవేశించాలి. ఆత్మతత్త్వమునకు ఉన్న శక్తి మరెక్కడా కానరాదు. అణుబాంబు శక్తికంటే గొప్పశక్తి ప్రేమ శక్తియే. ద్వేషులను కూడా మార్చివేస్తుంది. సర్వులూ వశమైపోతారు. అట్టి ప్రేమ తత్త్వాన్ని మనం పెంచుకోవాలి.

భారతభూమి త్యాగభూమి, యోగభూమి, పుణ్య భూమి. ఇంతటి పవిత్రమైన భూమిలో పుట్టిన మీరు ఎందుకు త్యాగం చేయలేకపోతున్నారు. మీరు భారతీ పుత్రులు. కనుక మీరు భారతీయులుగా జీవించటానికి ప్రయత్నించండి. ఇతరులకు ఆదర్శమును నిరూపించండి. ఇతరులకు ఆనందాన్ని అందించండి. ఇదియే ఈనాడు పంచుకోవలసిన ఆనందం.

ఈ దేహమునకు నేడు పుట్టిన దినమేకాని, నాకు పుట్టిన దినములేదు. మీరందరూ రావటంచేత, మీరందరూ ఆశించటంచేత ఇది ఒక జన్మదినంగా భావిస్తున్నాను. కనుక నాకు ఈ Birth Day కాదు ముఖ్యం. మీరందరూ ఆనందంగావుండిన దినమే నా Birth Day. ఇట్టి ఆనందాన్ని నేను ఆశిస్తున్నాను. ఇట్టి ప్రేమతత్త్వాన్ని నేను ఆశిస్తున్నాను. ఇట్టి త్యాగతత్త్వాన్ని నేను ఆశిస్తున్నాను. నాకు ఏమీ అవసరంలేదు. మీరు త్యాగులై, యోగులై ఆనందమయులై తగినటువంటి దివ్యత్వాన్ని మీరు అనుభవించినప్పుడు, అదియే నా ఆనందం. మీరందరూ శాంతి సుఖములతో జీవితాన్ని గడపాలని నేను ఆశిస్తున్నాను. ఈ పవిత్రదినాన మీరందరూ ఉత్తమ భావాలతో మీ హృదయాలను నింపుకోండి!

*(23-11-1998న ప్రశాంతినిలయంలో భగవాన్ సాయి తన జన్మదినోత్సవ సందర్భమున చేసిన దివ్య ప్రసంగంనుండి)*

*



# నాకు ప్రేమను ఇచ్చుకోండి! నానుండి సర్వమునూ పుచ్చుకోండి!



**ఏడు ప్రశ్నలు - సమాధానములు**

ప్రతి వ్యక్తీ నిత్యజీవితంలో ఎదుర్కొనే సంశయాలకు సందేహాలకు సముచితమైనరీతిలో సరియైన సమాధాన ములు ది. 24-11-1998న ప్రశాంతి నిలయంలో జరిగిన సభలో భగవాన్ సాయి భక్తులకు విశదీకరించారు. వారు చేసిన ఈ దివ్య ప్రసంగం భక్తులపాలిటి కల్పతరువు. కనుక చదవండి! చదివించండి! సంశయాలను నివృత్తి చేసుకోండి! అవగాహన చేసుకోండి! ఆచరణలో పెట్టండి! తరించండి! ఈ మానవజన్మను సార్థకం చేసుకోండి!

"మానం హిత్వా ప్రియోభవతి
క్రోధం హిత్వా నశోచతి
కామం హిత్వా అర్థవాన్ భవతి
లోభం హిత్వా సుఖీభవతి

ప్రేమస్వరూపులారా!

మానవునియందు అహంకారం ఉండినంత వరకు కన్నబిడ్డలైనా, కట్టుకున్న భార్యఅయిన ప్రేమించదు. కేవలం ప్రాకృత ధర్మములను ఆధారం చేసుకొని, లౌకికమైన జీవితమును ఆధారం చేసుకొని, గౌరవించి నట్లు, ప్రేమించినట్లుగా నటించటమేగాని, హృదయ పూర్వకమైన ప్రేమతో ప్రేమించలేదు. కోపం ఉండి నంతవరకునూ, మానవునికి ఈ శోకం తప్పునది కాదు. కోపమే మానవునికి దుఃఖమును అందిస్తుంటుంది. వాంఛలు ఉండినంతవరకును, నీ అభీష్టములు ఏ మాత్రం నెరవేరవు. ఏనాడు నీవు ఈ లోభమును, ఈ కామమును, ఈ క్రోధమును, ఈ అహంకారమును నిర్మూలనం గావింతువో, ఆనాడే నిన్ను ప్రేమించుదురు, నీ దుఃఖము నిర్మూలనమగును. నీవాంఛలు నెరవేరును, నీకు ఆనందం ప్రాప్తించును. మానవుని యొక్క సమస్త దుఃఖములకు, సమస్త విచారములకు, సమస్త అశాంతులకు మూలకారణము కామక్రోధలోభమోహఅహంకారములే.

మానవుడు సాధనలు దేనినిమిత్తమై చేస్తున్నాడు? సుఖముకోసమో, దుఃఖంకోసమో, ఆనందంకోసమో, శాంతికోసమో సాధనలు చేస్తున్నట్లుగా భావిస్తున్నారు. మానవులకు ఆనందంగాని, సంతోషంగాని,దుఃఖముగాని, విచారంగాని -ఏదీ కూడా ఈ సాధనలు నీకు అందించవు. ఏ ఆనందం, దుఃఖం ఎక్కడ నుండి ఆవిర్భవిస్తున్నదో, దానిని మనం వశం చేసుకున్నప్పుడే మనకు ఈ ఆనంద దుఃఖములు రెండూ నిర్మూలనం గావించబడుతాయి. అసలు ఈ ఆనందం ఎక్కడినుంచి పుట్టింది? ఈ దుఃఖము ఎక్కడ నుంచి ఉద్భవించినది? మనసు నుంచే.

## భగవాన్ సాయి సుబోధ

కనుకనే వేదాంతం"మన ఏవ మనుష్యాణాం కారణం బంధమోక్షయోః'' అన్నది. ఈ బంధమోక్షములకు, ఆనంద దుఃఖములకు పుట్టినిల్లు మనసే. కనుక నీవు ఈ మనసును స్వాధీన పరచుకున్నప్పుడు నీకు ఎట్టి విచారము, ఆనందము- ఈ రెండూ లేక సమత్వమైన జీవితాన్ని అనుభవించగలవు. నీవు ఆనందమును ఏ ఉద్దేశ్యంతో ఆశిస్తున్నావో, అదే ఉద్దేశ్యంతో దుఃఖమును కూడా నీవు ఆశించాలి. సుఖదుఃఖములు రెండింటినీ ఒకే భావంతో, ఒకే సంకల్పంతో, ఒకే ఆనందంతో నీవు స్వాగతం పలికినప్పుడే నీకు సమత్వమనేది ఏర్పడుతుంది. నిజంగా విచారిస్తే, ఆనందమునుండి వచ్చేటటువంటి సుఖముకంటే, దుఃఖము నుండి కలిగేటటువంటి సుఖమే శాశ్వతమైనటువంటిది. పవిత్రులైన మహనీయుల చరిత్రలు పరిశీలిస్తే- వీరందరూ దుఃఖమునుండియే ప్రశాంతిని పొందగలిగారు. ఈ ప్రపంచంలో ఎవరిని ఆదర్శ పురుషులని విశ్వసిస్తున్నాం, వారందరూ పూర్వం ఈ దుఃఖము నుండియే ఆనందాన్ని పొందగలిగారు. ప్రతి ఒక్కరూ దుఃఖమునుండియే ఆనందాన్ని పొందుతున్నారు. 'న సుఖా లభ్యతే సుఖం' సుఖమునుండి మనకు సుఖము

ప్రాప్తించదు. దుఃఖమునుండియే మనకు సుఖం ప్రాప్తిసుంది. ఈ సత్యమును ప్రతి వ్యక్తి గుర్తించాలి. కాని ఈనాటి మానవులు దుఃఖమును వద్దంటున్నారు, సుఖమును కావాలంటున్నారు. ఇది ఆధ్యాత్మిక మార్గమునకు అత్యంత విరుద్ధం. పుణ్యఫలితాన్ని ఆశిస్తున్నాం, పాపఫలితాన్ని వలదంటున్నాం. దీనినే వేదము "పుణ్యశ్చ ఫలమిచ్ఛంతి పుణ్యం నశ్చంతి మానవః న పాపం ఫల మిచ్ఛంతి పాపం కుర్వంతు యత్రతః" అన్నది. ఈనాడు మానవుడు పుణ్యఫలమును ఆశిస్తున్నాడుగాని, పుణ్యకర్మలను చేయడానికి ముందుకు రావడం లేదు. పాప ఫలమును వద్దంటున్నాడు గాని పాప కర్మలకు ముందంజ వేస్తున్నాడు. ఇదియే సాధనకు విరుద్ధమైన మార్గము. ఏది కావాలని ఆశిస్తున్నావో, దానికి తగిన ప్రయత్నం చేయాలి. ఏది వద్దని కోరుకుంటున్నావో, దానికి నీవు ఏ మాత్రం పూనుకోకూడదు. కాని ఈనాటి సాధనలన్నీ విరుద్ధమైన మార్గంలో జరుగుతున్నాయి.

మానవుడు దైవత్వాన్ని పొందవలెననిన, సాక్షాత్కారము అనుభవించవలెననిన, తనస్వస్వరూపాన్ని దర్శించవలెననిన నవవిధభక్తి మార్గములు సూచించారు మన మహర్షులు. ఈ నవవిధమార్గములయందు 'ప్రేమ' అంతర్వాహినిగా ప్రవహిస్తుంటుంది. కనుక అన్నింటికీ ప్రేమయే ప్రధానం.

బ్రహ్మతత్త్వాన్ని ఏరీతిగా పొందాలి? సర్వత్రా వ్యాపించేటటువంటిదే బ్రహ్మతత్త్వము. ఈ బ్రహ్మ పుట్టిన స్థానం ఎక్కడ? విష్ణునాభి నుండి పుట్టినవాడు బ్రహ్మ. విష్ణువనగా ఏమిటి? సర్వత్రా వ్యాపించటమే విష్ణుతత్త్వము. విష్ణువుకు, బ్రహ్మకు 'ఆత్మ' అనిపేరు. 'ఆత్మ' అనగా ఏమిటి? 'అహస్సు' అనేదాని నుండి పుట్టినటువంటిది 'ఆత్మ'. 'అహస్సు' అనగా ఏమిటి? పగలు అని అర్థము. ఎప్పుడు ఈ 'అహస్సు' అనే పగలు ప్రారంభమవుతుందో, అప్పుడు చీకటి దూరమైపోతుంది. అంధకార, అజ్ఞానములు దూరం కావలెననిన ప్రకాశమును మనం వెలిగించాలి. కనుకనే పరబ్రహ్మ స్వరూపానికి 'దివ్యజ్యోతి స్వరూపుడు' అని పేరు పెట్టారు. ఇతనికి ఒక పేరు అనేటటువంటిదిలేదు. కనుక దీనికి 'బృహత్ వ్యాప్తి' అని చెప్పారు. జ్యోతిర్మయుడైనటువంటివాడు భగవంతుడు. అనగా ప్రకాశవంతమైనవాడు భగవంతుడు. ఈ ప్రకాశవంతమైన తత్త్వాన్ని మనం అనుభవించాలంటే ఏమిచేయాలి? ఈ ప్రకాశమునకు 'సత్' అని పేరుపెట్టారు. మిగిలినవన్నీ నశించిపోయేటటువంటివే. 'యద్దృశ్యం తన్నశ్యం". చూచినవన్నీ నశించేటటువంటివే.

"అస్థిరం జీవనంలోకే
అస్థిరం యౌవనంధనం
అస్థిరం దారాపుత్రాది
సత్యం కీర్తి ద్వయం స్థిరం"

అన్నీ నశించేటటువంటివే. అన్నీ క్షీణించేటటువంటివే. అన్నీ కేవలం అదృశ్యమయ్యేటటువంటివే. కాని నిలిచేటటువంటి 'సత్' - అదే సత్యం. కనుకనే అట్టి బృహత్వ్యాప్తి స్వరూపుడయినటువంటి బ్రహ్మకు 'సత్యం' అని పిలిచారు. ఆ సత్యము నుండియే జ్ఞానము ఆవిర్భవించినది. ఈ జ్ఞానం, సత్యము కూడనూ సర్వవ్యాపకమైనటువంటివి. కనుకనే వేదము "సత్యం జ్ఞానం అనంతం బ్రహ్మ" అన్నది. ఈ సత్యమే జ్ఞానము. జ్ఞానమే అనంతం. అనంతమే బ్రహ్మ స్వరూపము. నాలుగు పేర్లు మాత్రమే ఉన్నాయిగాని, సర్వవ్యాపకమైన దైవత్వం ఒక్కటే. అదే 'సత్'. ఇట్టి సత్యస్వరూపుడ్ని మనం పొందాలనుకుంటే ఏంచేయాలి? సత్యాన్ని అనుసరిస్తూ రావాలి. సత్యమనగా ఏమిటి? త్రికాలముల యందూ మార్పుచెందనటువంటిదే 'సత్యం' ఏ పదార్థము అయినా మారవచ్చునుగాని, సత్యము మారుటకు వీలులేదు. భూత, భవిష్యత్, వర్తమాన కాలములయందు కూడనూ ఏకత్వంగా ఉండునదే 'సత్యం'

భగవంతుడు ఈ జగత్తునందు ఎందుకోసం అవతరిస్తున్నాడు? అనేకత్వంలోని ఏకత్వాన్ని దర్శింపజేసి, అనేకత్వంలోవున్నటువంటి ఏకత్వాన్ని గుర్తింపజేసి, ఆ ఏకత్వంలో ఉన్నటువంటి దైవత్వాన్ని ప్రబోధించి, ఆ దైవత్వమునే నీ యొక్క స్వరూపకంగా మార్చుకొనే నిమిత్తమై ఆ వ్యాప్తికంగా ఈ అవతారములు వచ్చాయి. అనేకత్వాన్ని ఏకత్వంగా మనం వహించటమే ఆధ్యాత్మికము యొక్క సారం. ఇదియే మన లక్ష్యం. ఇదియే మన గమ్యం.

అనేకంగా కనిపించేటటువంటి మానవ స్వరూపాలను ఏకత్వంగా మనం విశ్వసించాలి. దేహములు వేరు కావచ్చు. నామములు వేరుకావచ్చు. జీవితం యొక్క ప్రవర్తనలు వేరుకావచ్చు. కాని అన్నింటియందు ఉన్నటువంటి ఏకత్వం ఒక్కటే. అదియే ఆత్మతత్త్వము. నీయందు ఏ ఆత్మ కలదో, సర్వులయందూ అదే ఆత్మ ఉంటున్నది. సర్వుల యందూ ఏ 'ఆత్మ'కలదో, ఆ'ఆత్మ' నీయందే ఉంటున్నది. ఈ సత్యమును చక్కగా గుర్తించి, వర్తించటమే ఆధ్యాత్మికము యొక్క లక్ష్యం. కాని ఈనాటి మానవుడు దేహాభిమానం చేత, తన స్వస్వరూప స్వభావము ను మరచి, ఏకత్వాన్ని అనేకత్వంగా భావిస్తున్నాడు. ఉన్నది ఒక్కటే అయినప్పటికీ అనేకంగా చూస్తున్నాడు. అదియే అజ్ఞానము. అనేకత్వంగా ఉండినటువంటి దానిని ఏకత్వంగా నిరూపించటమే ఆధ్యాత్మికతత్త్వము. అట్టి తత్త్వమును గుర్తింపజేసేనిమిత్తమై అవతారములుఅవతరిస్తూ వచ్చాయి.

నాయనా! అందరూ ప్రత్యేకించినటువంటివారు కాదు. అందరూ ఏకత్వంతో జీవించేటటువంటివారే. "మమాత్మా సర్వభూతాంతరాత్మ". నా ఆత్మనే, మీ అందరియందు కూడనూ ప్రతిబింబిస్తూ ఉంటున్నది. ఈ దేహములన్నీ ఒక అద్దమువంటివి. ఈ మిర్రర్ (అద్దం) ఎక్కడ నుంచి వచ్చింది? మృణ్మయము నుండి వచ్చింది ఈ మిర్రర్. కనుక ఈ మట్టి యొక్క ఆకారములే ఈ అద్దములు. కనుక ఈ ప్రతిబింబాన్ని చూచేంతవరకు మీరు మృత్తిక స్వరూపులే. ఈ మృత్యుంజయమైనటువంటి తత్త్వాన్ని మనం తీసుకున్నప్పుడే, అమరత్వమనేటటు వంటిది మనకు ప్రాప్తిస్తుంది. ఇట్టి ఏకత్వంలో ఉన్నటు వంటి దివ్యత్వాన్ని మీరు చక్కగా గుర్తించడానికి ప్రయత్నించాలి. అన్ని అద్దములు ఒక్క మట్టితో చేసినటు వంటివే. ఈ మృణ్మయమైనటువంటి ఈ దేహమును చిన్మయంగా మార్చుకోవాలి. ఈ చిన్మయంగా మార్చుకోవటానికి వేరే సాధనలు చేయనవసరంలేదు. మృణ్మయమునందే ఉంటున్నది ఈ చిన్మయము. మనము దానిని సరియైన రీతిలో ప్రయత్న పూర్వకంగా సాధించలేకపోవటంచేతనే ఇది మృణ్మయము... మృణ్మయము.... మృణ్మయముగానే భావిస్తున్నాం.

ఆత్మానందం అనేదానిని ఏదో సాధనలచేత మనం సాధించుకుంటున్నామనుకోవటం చాలా పొరపాటు. నీ స్వరూపమే ఆత్మ స్వరూపం, నీ ఆనందమే ఆత్మానందం. నీ నడవడికే ఆత్మ నడవడిక. సర్వమూ ఆత్మ మయము. అయితే ఈ సత్యాన్ని గుర్తించుకోవటానికి ప్రయత్నం చేయటంలేదు. అగ్నిని నీవు సరియైన రీతిలో వినియోగించుకొనినప్పుడు అగ్ని అగ్నిగానే ఉంటుంది. కాని దానిని అలక్ష్యం చేసినప్పుడు, ఈ అగ్ని ఆరిపోయి దానిపైన నివురు కప్పినట్లు కనిపిస్తుంది. ఊదుతే పై బూడిదపోతుంది. అగ్ని కనిపిస్తుంది. అదే విధముగనే ప్రతి మానవుని యందునూ ఆత్మ స్వరూపుడైన నిప్పు రగులుతూనే ఉంటుంది. మధ్య మధ్య దీనిని అలక్ష్యము చేయటంచేత, ఆ అగ్ని నుండియే నివురు పుట్టి దానిని కప్పివేస్తున్నది. అయితే నామస్మరణ అనే సాధనచేస్తే నివురుపోతుంది. నిప్పు కనిపిస్తుంది. ఈ నిప్పు కోసం నీవు వేరే ప్రయత్నం చేయనవసరంలేదు. దానికి కప్పిన నివురును ఊదివేస్తేచాలు. కప్పిన నివురు ఏమిటి? అహంకార మమకారములు, కామక్రోధలోభములు మానవుడ్ని కప్పివేస్తున్నాయి. దేహాభిమానం అమితంగా పెరిగిపోతున్నది. ఈ దేహాభిమానమే అహంకారాన్ని పెంచివేస్తున్నది. అహంకారం ఉండినంతవరకునూ, నీవు దేనిని సాధించలేవు. అహంకారంలేకపోవటమే నిజమైన మానవత్వం. పుట్టినప్పుడు ఎట్టి అహంకారంలేదు. క్రమ క్రమేణ దానిని పెంచుకుంటూ వస్తున్నాడు. ఇది నాది.... ఇది నాది.... ఇది నేను... ఇది నేను..... అనే అహంకారాన్ని పెంచుకుంటూ, అభిమానంతో వ్యవహరిస్తున్నాడు. 'నేను' అనే అహంకారం, 'నాది' అనే మమకారం - ఈ రెండే మానవునికి బంధనలు. ఈ రెండూపోతే సర్వమానవులూ ఆనందమయులే. ఈ ఆనందం ప్రత్యేకంగా సాధనలచేత లభించేదికాదు.

ఈ సాధనలు ఎందుకు చేయాలి? ఎందుకు చేస్తున్నాం? తాత్కాలికంగా మనసు తృప్తికోసం చేస్తున్నాం. అంతేగాని ఈ అస్థిరమైన లోకమునందు, అశాశ్వతమైన జీవితమునందు, సత్యనిత్యమైన దానిని పొందటం అసాధ్యం. కలిగే అనుభూతులన్నీ తాత్కాలికమైనటు

వంటివి. ఇవి సత్యనిత్యమైనటువంటివి కావు. సత్యనిత్యమైనటువంటిది ఆత్మ యొక్క ప్రజ్ఞయే. ఈ ఆత్మ ప్రజ్ఞయే నిత్యమూ, సత్యమూ నీయందే ఉంటున్నవి. నీవే ఆత్మయై ఉంటావు. కనుక అట్టి భావాన్ని దినదినాభివృద్ధి గావించుకోవాలి.

ఈనాడు "నేను ఎవరు? నేను ఎవరు?" అనే ప్రశ్నను ఎవరూ వేసుకోవటంలేదు. ప్రతి మానవుడూ "నీవు ఎవరు? నీవు ఎవరు?" అని ప్రశ్నిస్తున్నాడుగానీ, తానెవరో? తాను తెలుసుకోవటానికి ప్రయత్నించడం లేదు. "నీవెవరు? నీవెవరు?' అని ప్రశ్నించడం వలన నీకు లభించే ఫలితమేమిటి? కేవలం ఇదంతా Information తీసుకోవటమే. ఈ Information వలన మనకు వచ్చే ఫలితమేమిలేదు. 'నీవు ఎవరు?' అనే పదమును 'నేను ఎవరు?' అనే పదముగా మార్చుకున్నప్పుడు Transformation అయిపోతుంది. నీవు ఎవరు? అనేది Information నేను ఎవరు? అనేది తెలుసుకోవటమే Transformation. ఈ Transformation స్థాయికి నీవు వచ్చినప్పుడు ఏ సాధనలూ చేయనవసరంలేదు. నీవు నీవే అయివున్నావు. ఇంక దేనికోసం సాధనలు చేస్తున్నావు? వీటన్నింటికీ మూలకారణం మనసే.

ఈ మనసే దుఃఖమును, విచారమును, ఆనందమును, శాంతిని మనకు అందిస్తున్నది. మన మనసును మనం స్వాధీనం చేసుకుంటే మనకు అన్నీ స్వాధీనమవుతాయి. పతంజలి మహర్షి చెప్పాడు. "యోగః చిత్తవృత్తి నిరోధకః" యోగమంటే ఏమిటి? హఠయోగం కాదు. ఈ యోగం, ఆ యోగం కాదు. ఇవన్నీ యోగాలు కావు రోగాలే. యోగమనగా చేరటమే. నేను ఆత్మతో చేరటం యోగం Joining with Atma is Yoga. ఆత్మతో చేరితే అంతకన్నా ఆనందం మరొకటిలేదు. ఆత్మ ఊర్ధ్వ స్థాయిలో ఉంటున్నది. దానిని చేరితే ఇంక నీ ప్రయాణమే లేదు. అదే Last Station, అదే Final Station. ఈ Final Station కు చేరాలి.

మొట్టమొదటిది దేహం, రెండవది ఇంద్రియములు, మూడవది మనసు, తరవాతది బుద్ధి, ఆఖరిది ఆత్మ. కనీసం బుద్ధి వరకూ కూడా మనం ప్రయాణం చేయటంలేదు. మనసు వరకే ప్రయాణం చేస్తున్నారు. ఈ మనసు అంటే ఏమిటి. ఇంద్రియముల చేరికే మనసు. ఇంద్రియములచేత నీవు కూడుకొని, మనసుగా తయారుచేసుకొని, ఈ మనసులో అనేక విధముల క్రుంగిపోతున్నావు. ఈ Depression మరియు Confusion రెండూ కూడా మనసువలనే కలుగుతున్నాయి. ఈ Depression, Confusion రెండూ చేరేటప్పటికీ ఫ్యూజ్ (Fuse) పోతుంది. ఇది పాంచభౌతిక దేహం. ఇది ఏనాటికీ నిత్యసత్యమైనటువంటిదికాదు. ఏ నిముషములో ఏమై పోవునో! కనుక ఈ అనిత్యము, అశాశ్వతమైన దేహమును ఆధారం చేసుకోవద్దు. ఈ దేహాభిమానం చేతనే, ధనాభిమానం కూడా నీకు పెరిగి పోతున్నది. ఈ ధనాభిమానం చేతనే గుణాభిమానం కూడా పెరిగిపోతున్నది. ఈ గుణాభిమానంచేతనే సర్వవిధమైన వ్యామోహములు కలుగుతున్నాయి. అయితే ఈనాడు చదువు, ధనము రెండు ముఖ్యమన్నారు. చదువు చెడ్డది కాదు, ధనము చెడ్డది కాదు. దానిని వినియోగించుకొనే వ్యక్తి మంచి చెడ్డల మీద ఆధారపడి ఉంటుంది. ఇది నీరు. ఈ నీటి యొక్క రంగు తెలుపు. ఈ తెల్లగా ఉండే నీరును ఎర్ర సీసాలో పోస్తే ఎర్రగా కనిపిస్తుంది. నల్లటి సీసాలోపోస్తే నల్లగా కనిపిస్తుంది. మరల అదే నీరు తెల్లటి సీసాలో పోస్తే తెల్లగా కనిపిస్తుంది. అదే విధముగా విద్య, ధనము అనేటటు వంటివి పరిశుద్ధమైన, స్వచ్ఛమైన తెల్లని జలము వంటివి. ఆ జలము ఏ రంగు సీసాలో పడితే ఆ రంగుగా కనిపిస్తుంది. ఈ తెలుపు, ఎఱుపు, నలుపు అంతా మానవుని యొక్క మనోభావములే కాని పవిత్రమైనటువంటి విద్య యొక్క దోషముగాని, ధనము యొక్క దోషము కాని కాదు. ఈనాడు మానవుడు 'వీడు చెడ్డవాడు, వీడు మంచివాడు' అంటున్నాడు. 'ఇది చెడ్డది, అది మంచిది' అని విమర్శిస్తున్నాడు. ఈ మంచి, చెడ్డలు రెండూ కూడనూ నీ మనసు యొక్క ప్రభావములే గాని, బయట వున్నటు వంటి వ్యక్తుల ప్రభావంకాదు. కనుక మనం ఈనాడు మార్పు కోరవలసింది మన దృష్టిని. దృష్టి పవిత్రమైనటువంటిదిగా వుంటే సృష్టి అంతా పవిత్రంగానే కనిపిస్తుంది. కనుక మొట్టమొదట మన దృష్టిని మార్చు

కోవాలి. మన హృదయమును పవిత్రం గావించుకోవాలి, పరిశుద్ధం గావించుకోవాలి. ఈ విధమైన సాధనల ద్వారానే, అనేకత్వంలోని ఏకత్వాన్ని దర్శించడానికి వీలవుతుంది.

ఈనాడు మానవులు ఎన్నో సందేహాలతో ఉంటున్నారు. ఈ సందేహాలు ఎక్కడ నుంచి వస్తున్నాయి? ఇవి ఏవిధంగా అభివృద్ధి అవుతున్నాయి? ఈ సందేహాలకు, సంశయాలకు మూలకారణం పరిపూర్ణమైన విశ్వాసం లేకపోవటమే! దైవంపైన పరిపూర్ణమైన విశ్వాసం ఉన్నటు వంటివాడికి ఈ Doubts (సందేహాలు) రావటానికి అవకాశమేలేదు. పీటర్ అనే బెస్తవాడు జీసస్‌ను కలిసి నప్పుడు, అక్కడ వున్నవారందరూ సంపూర్ణమైన విశ్వాసం గలవారని గుర్తించాడు. కాని ఒక్కడు మాత్రం అన్నిటినీ అనుమానించేటటువంటివాడుట. అతనినే Doubting Thomas అన్నారు. 'డౌటింగ్ థామస్'లకే అనుమానాలు, సందేహాలు రావటానికి అవకాశం ఉన్నది. అయితే కొన్ని సాధనామార్గములలో కొన్ని సంశయాలు సహజంగానే వస్తుంటాయి.

మొదటి సంశయం. ఈ మహాసభలో చర్చల సందర్భమున ఒకవ్యక్తి ఒక సంశయాన్ని వెలిబుచ్చాడు. 'నేనే సత్యమును, నేనే సరియైన దారిని చూపించేటటు వంటివాడిని. ఇంక వేరే మానవులు ఈ జగత్తులోలేరు" అని జీసస్ చెప్పాడని ఈ మహాసభలో ఒక వ్యక్తి "Is it Right? or Wrong? అని నాకు ఒక ప్రశ్న వేశాడు. 'నేనే సత్యమును. నేనే కాపాడేటటువంటివాడిని, సర్వవిధము లైన బాధలను నివారించి, నేనే రక్షించేటటు వంటివాడిని' అని జీసస్ ఎప్పుడూ చెప్పలేదు. అతనికి అహంకారమనేదే లేదు. ఈ వ్రాసే రచయితలు కల్పిస్తూ వచ్చారు. ఈ బైబుల్‌ను అనేకమంది వ్రాశారు. ఐదువందల రకాల బైబుల్స్ ఉన్నాయి. మొట్టమొదట బైబిల్‌ను 'లూయీస్' వ్రాశాడు. బెస్తవారితో జీసస్ మాట్లాడేటప్పుడు 'క్రేమామన్' వచ్చి కూర్చొని అన్నీ వ్రాసుకొనేవాడుట. అతను అప్పుడు ఇన్‌కంటాక్స్ కమీషనర్‌గా ఉండేవాడు. ఈ విషయం అతనే మొదట వ్రాశాడు. బెస్తవారితో జీసస్ మాట్లాడుతూ, "నేను చూచుకుంటాను పో!" అనే రీతిగా చెప్పాడుకాని "నేనే చూచుకుంటాము", "నేనే చూచుకుంటానికే వచ్చాను" అని అహంకారంతో చెప్పలేదు. వారికి ఉత్సాహాన్ని, ధైర్యాన్ని అందించే నిమిత్తమై "నేను చూచుకుంటాను పో!" అన్నాడు. ఆ చిన్న వాక్యాన్ని ఆధారం చేసుకొని అనేకమంది పండితులు దీనిని "తానే చూచుకుంటాను. ఎవరికీ ఏ ఆపద లేకుండా నేనే కాపాడుతాను" అని జీసస్ చెప్పినట్లు వ్రాశారు.

ఇంతేగాక I am the Messenger of God అని, రెండవది I am the Son of God అని, మూడవది I and My Father are One అని జీసస్ చెప్పినట్లుగా బైబిల్‌లో వ్రాశారు. కాని జీసస్ ఆ విధంగా ఎప్పుడూ చెప్పలేదు. అయితే ఎవరు? ఎప్పుడు చెప్పారు. జీసస్ పుట్టిన సమయంలో ముగ్గురు అరేబియన్ రాజులు ఎక్కడికో ప్రయాణమైపోతున్నారు. 'స్టార్'ను చూచి ఆ ప్రాంతానికి వెళ్ళారు. ఆముగ్గురు రాజులలో ఒకడు ఆ పసివానిని చూచి "ఇతను ఏదో దైవము యొక్క Messenger గా కనిపిస్తున్నాడు నా దృష్టికి" అన్నాడు. రెండవరాజు చూచి "ఇతను Messenger కాదు, ఇతను Son of God అన్నాడు. ఇక మూడవరాజు "No.... No. He is not Son. He is not Father. Son and Father are One" అని అన్నాడు. ఇది అరేబియన్ రాజులు చెప్పిన విషయం. దీనిని ఆధారం చేసుకొని రచయితలు బైబుల్‌లో అనేక విధాల వ్రాస్తూ వచ్చారు. జీసస్‌కు ఏనాడునూ అహంకారమేలేదు. బాధ పడేవారిని చూచి కరుణారసమును చల్లేటటువంటి వాడు జీసస్. అతనికి కరుణయే హృదయము. అయితే కొన్ని కొన్ని సందర్భాలలో ధైర్యంగా ఎదుర్కొని నిలబడేవాడు.

మొట్టమొదట నుంచి జీసస్‌కు వ్యతిరేకంగా మాట్లాడేవాడు 'పీటర్'. కొంతకాలం జరిగిన తరువాత పీటర్ స్వప్నం లోపల జీసస్ వెళ్ళి "పీటర్! నీకు నేను ఏమి ద్రోహం చేశాను? నీకు ఏమి బాధలు కలిగించాను? ఎందుకు నన్ను ఇంత విమర్శిస్తున్నావు?" అని ప్రశ్నించాడు. ఆ తరువాత పీటర్ చాలామారాడు. అతని మనసు మారింది. 'ఇది నా భ్రమే, నాదోషమే, నా అహంకారమే, నా అజ్ఞానమే' అని తెలుసుకొని తరువాత జీసస్‌కు భక్తుడయ్యాడు. పూర్తిగా మారిపోయాడు. తరువాత అతనిని 'సెయింట్ పీటర్' అని పిలువసాగారు. బైబిల్‌లో

ఉన్న సత్యవాక్యములను సరియైన రీతిలో అర్థంచేసుకుంటే, జీసస్‌ది ఏ దోషములేదని అర్థమవుతుంది. అందరినీ భగవత్ భాగ్యంలో ప్రవేశపెట్టాలని ఆశించాడు. కట్టకడపటికి శిలువ వేసే సమయం లోపల తాను ప్రార్థించాడు' ఓ తండ్రీ! నేను ఏమి తప్పుచేశాను? నన్ను ఎందుకు ఈవిధంగా శిక్షిస్తున్నావు?' అని ప్రశ్నించాడు. దీని అంతరార్థం ఏమిటి? దైవము తండ్రిగాను, తాను బిడ్డగాను యుక్కడ ఒక అర్థం తీసుకోవచ్చును. కాని 'I am God' అని చెప్పలేదు. 'I am Messenger' అని చెప్పలేదు. 'I am the Son of God' అని చెప్పలేదు. 'I and Father are One' అని చెప్పలేదు. ఏమీ చెప్పలేదు. తానుపలికిన పలుకులు మనకు, మానవత్వానికి అర్థం కావటానికి దైవము తండ్రి తాను బిడ్డగా భావిస్తూ వచ్చాడు. శిలకు కొట్టిన తరువాత మేరీ వచ్చి ఏడుస్తుంటుంది. అప్పుడు అశరీరవాణి వినిపిస్తుంది. "All are One, My Dear Son, Be Alight to every one". అందరి యొక్క ఏకత్వాన్ని చక్కగా గుర్తించి చెప్పినటు వంటి వాడు జీసస్. దీనిని బట్టి విచారణ చేయగా తాను దైవము యొక్క బిడ్డగాను, దైవము తన యొక్క తండ్రి గాను చక్కగా మనకు స్పష్టమవుతూ వచ్చింది. కాబట్టి, "నేనే సత్యమును. నేను మీ రోగములను నివారణ చేస్తాను, నేను తప్ప మరొకరులేరు" అని అహంకారంతో ఎన్నడూ చెప్పలేదు జీసస్.

ప్రతి అవతారమునందు ఈవిధమైన తత్త్వాలు చెబుతూ వచ్చింది. "మమైవాంసో జీవలోకే జీవభూత స్సనాతనః" అని కృష్ణుడు చెప్పాడు. 'నేను, నా యంశము' అని చెబుతూ వచ్చాడు. "నీవు నాయొక్క దాసుడవు, నీవు నా భక్తుడవు, నాకు నమస్కారం చేయి. నీ సర్వస్వాన్ని నేను చూచుకుంటాను" అన్నాడు కృష్ణుడు. ప్రతి దాని కోసం 'నేను, నేను' అనేది ఒక్క అవతార తత్త్వమునందు మాత్రమే వస్తూ వచ్చింది. కాని 'జీసస్' మాత్రం ఆవిధంగా చెప్పలేదు.

ఇక భగవద్గీతయందు 'నేనే సర్వమునూ రక్షించుతూ వస్తాను. ఈ సర్వానికి నేనే మూలకారణం, నేనే ఈ సర్వస్వమునూ సృష్టిస్తూ వచ్చాను. ఈ నాలుగు వర్ణములకూ నేనే మూలకారణం" అన్నాడు కృష్ణపరమాత్మ. ఈ వర్ణముఅనేది ఎక్కడనుంచి వచ్చింది? వర్ణము అంటే ఏమిటి? ఇది మతముకాదని భావిస్తున్నాం. 'చాతుర్వర్ణం మయాసృష్టి' అన్నాడు. ఈ నాలుగు రకముల వర్ణములు నా సృష్టియే అన్నాడు. నల్లని రంగు (Black), తెల్లని రంగు (White) పసుపుపచ్చ (Yellow) ఎఱుపు (Red) - ఈ నాలుగు వర్ణములవారు నా సృష్టియే అన్నాడు. వర్ణములు అనేదానికి మతములు, కులములు అని భావిస్తూ వచ్చాం. భగవంతుడు అలా చెప్పలేదు. నల్లని వారు ఎవరు? నీగ్రోలు, భారతీయులు వగయిరాలు. తెల్లని రంగువారు ఎవరు? జపనీలు, బ్రిటీషు వగయిరాలు. పసుపుపచ్చని వారు ఎవరు? చైనీస్ వగైరాలు. ఎర్రని వారెవరు? రష్యన్లు వగైరాలు. కనుక ఈ నాలుగు రంగుల వర్ణములు నా సృష్టియే అన్నాడు భగవంతుడు. భగవంతుడు చెప్పినది విశాలమైనటువంటిదిగాని, సంకుచితమైనటువంటిది కాదు. కనుక ఈ సందేహాలకు అవకాశం ఇవ్వకండి. ముస్లీములు కావచ్చును, హిందువులు కావచ్చును, క్రిష్టియన్లు కావచ్చును, జోరాష్ట్రియన్లు కావచ్చును. అందరూ దైవం బిడ్డలే. మొట్టమొదట రోమన్లు క్రిష్టియన్లుకాదు, యూదులే. జీసస్ అవతారం వచ్చిన తరువాత, క్రిష్టియన్ పరిపాలన పెరిగిన తరువాత అప్పుడు 'క్రిష్టియన్' అనే పేరు వచ్చింది.

జీసస్ మొట్టమొదట నేను 'పర్సోనియా' (Personia) అన్నాడు. అంటే ఏమిటి? దైవత్వంతో కూడినటువంటివాడిని అని అర్థం. రోమన్ మాట 'పర్సోనియా' అయితే బ్రిటీష్‌వారు Person అన్నారు. భారతీయులు 'పురుషః' అన్నారు. 'పర్సోనా' అనగా పవిత్రమైనది. ప్రతిమానవుని యందు దైవత్వం ఉన్నది. కాబట్టే అతనిని 'Person' అని పిలుస్తూ వచ్చారు. భారతీయ సంస్కృతియందు, వేదశాస్త్ర ఇతిహాస పురాణములయందు కూడనూ 'పురుషుడు' అని పేరుపెట్టారు. 'యల్లబ్ధపుమాన్, ఇచ్ఛారామో భవతి, తప్తోభవతి, మత్తో భవతి, ఆత్మారామో భవతి' అన్నారు. పురుషత్వాన్ని గురించి ఈ విధమైన వర్ణనలు చేస్తూ వచ్చారు. అనగా దివ్యత్వమనేది సర్వుల యందూ

ఉంటున్నది. సర్వుల యందూ ఉన్నటువంటి ఏకత్వాన్ని మనం అనేకత్వంగా భావించి, భిన్నత్వంలో మనం అనుభవిస్తున్నాం. ఈనాడు మనం చేయవలసింది ఏమిటి? అనేకత్వంలో ఉన్నటువంటి ఏకత్వాన్ని మనం దర్శించాలి. అనేకత్వాన్ని మనం ఏకత్వంగా భావించాలి, అనుభవించాలి - అదియే సత్యసాయి సంస్థల యొక్క ప్రధానమైన లక్ష్యం. ఎట్టి బేధములకు అవకాశం ఇవ్వకూడదు, ఎట్టి భిన్నత్వము నకు, ఎట్టి ద్వేషమునకు అవకాశం ఇవ్వకూడదు. అందరి యందూ ఉన్నది ఒక్కటే. ఈ సత్యమును తెలుసుకుంటే, ఇదియే నిజమైన ఆధ్యాత్మిక ప్రచారం. ఈ ప్రచారం మనకు ఇప్పుడు అవసరంకాదు. ఆచరణ చాలా అవసరం.

దివ్యత్వమనేది అనేక రూపములలో మనకు గోచరమవుతుంటుంది. ప్రతిమానవుని యొక్క హృదయము నుండి ఆవిర్భవించేటటువంటి శబ్దము, నాభి నుంచి వచ్చేటటువంటిది. ఆ నాభిస్థానమే బ్రహ్మస్థానము. దీనినే Expansion Talk అన్నారు. ఇది నాభి నుంచి వచ్చేటటువంటిది. కొందరి మాటలు పెదవులపై నుంచి వస్తుంటాయి. ఇది Contraction Talk అన్నారు. ఇది Death తో సమానం. ఇది కేవలం పెదవుల నుంచి వచ్చేటటువంటిది. హృదయమునుంచి వచ్చిన మాటను సత్యంగా తీసుకుంటారు. వాక్కు నుంచి హృదయానికి మార్చేటటువంటివాడు అసత్యంగా పోతుంటాడు. మాట హృదయమునుంచి రావాలి. మాటలో హృదయం లేదు. మాటను హృదయంగా మార్చేటటువంటి వారు కొందరుంటారు. హృదయమునే మాటలుగా మార్చేటటు వంటివారు కొందరుంటారు. ఈనాడు మనమాట హృదయము నుంచి రావాలి. అదియే Complete Confidence. ఆ పరిపూర్ణ విశ్వాసం గలవారికి సందేహాలు రావు. అందరియందు దైవత్వం ఉంటున్నది. ఎవరేమి చెప్పినా సత్యంగానే ఉంటుంది. కాని ఆ సత్యం నాకు అన్వయిస్తుందా? లేదా? అని విచారణ చేసుకోవాలి.

ఇక సత్యాన్వేషణ. సత్యం ఒక్కటేగదా! దీనికి అన్వేషణ ఎందుకు చేయాలి? ప్రతి మానవుని యందు సత్యం, అసత్యం, ధర్మం, అధర్మం, హింస, అహింస - ఈ విధమైన మార్పులు కలుగుతున్నాయి. దీనికి ఒక ఉదాహరణ. పరిశుద్ధమైన బంగారం ఉన్నది. ఈ Pure Gold కు కొంత కాలానికి రాగిని చేర్చావు, మరి కొంత కాలానికి వెండిని చేర్చావు, ఇంకా కొంతకాలానికి బ్రాస్ చేర్చావు. ఈ విధంగా అనేక లోహములు చేర్చటం వలన అసలు బంగారము యొక్క స్వస్వరూపం పోయింది. ఈనాటి మానవుడూ అంతే. మానవుడు పుట్టినప్పుడు పవిత్రమైన, సత్యస్వరూపుడైన మానవుడు. అతను అన్నింటితో చేరి అనగా సత్యంతో, అసత్యంతో, ధర్మంతో, అధర్మంతో, హింసతో, అహింసతో, న్యాయంతో, అన్యాయంతో - ఈ గుణములు తన ఆత్మలో ప్రవేశించే టప్పటికి ఆత్మ కూడా మారిపోయి సుఖదుఃఖముల స్వరూపకంగా అయిపోయింది. ఈ జననమరణములకు మూలకారణం ఇదియే. శరీర అభిమానం, మానాభిమానం మొదలగు వివిధ అభిమానములు పెరిగిపోవటంతో మానవుడు తన స్వస్వరూపాన్నే తాను మరిచిపోతున్నాడు. బంగారం తన స్వస్వరూపాన్ని కోల్పోవటానికి మూల కారణం ఏమిటి? వివిధ లోహములు బంగారమునకు చేర్చటమే. తిరిగి దీనిని పరిశుద్ధం చేయాలంటే అగ్నిలో వేయాలి. అప్పుడు విడివిడి లోహములన్నీ వేరైపోయి స్వచ్ఛమైన బంగారం మిగులుతుంది. అదే విధంగా మానవుని నుండి దుర్గుణాలను వేరుచేయాలి. అసూయా, ద్వేషములను దూరం చేయాలి. ఈనాడు అహంకార, అసూయలు అమితంగా పెరిగిపోతున్నాయి. ఈ రెండూ పెరగటంచేత మానవత్వమే మంటకలిసిపోతున్నది. కనుక ఈ దుర్గుణాలను దూరంచేయాలి. దుస్సంగంలో చేర వద్దు. దుస్సంగమును దూరంచేసి సత్సంగంలో చేరండి. అప్పుడే మానవుడు తన స్వస్వరూపాన్ని తాను తెలుసుకో గలుగుతాడు. **"త్యజ దుర్జన సంసర్గం, భజసాధు సామాగమం, కురు పుణ్యమహోరాత్రం"** - ఇదే మనం చేయవలసిన సాధన. మీరు Pure Goldగా తయారు కావాలి. Quantity కోసం పరుగులెత్తకండి. Quality కోసం ప్రయత్నించండి. **'పంటపండని భూమి పదిఎకరములేల? కొంచమైన చాలు మంచి భూమి'** ఈవాస్తవాన్ని విస్మరించకండి.

ఈ కల్తీ లోహాలు అన్నింటినిచేర్చుకోవటం చేతనే ఈ స్వామి, ఆస్వామి, ఈస్వామి అని నీ ఆధారమై నటువంటి అసలు స్వామిని మరచిపోతున్నావు. నీ స్వామిని

నీవు మరచిపోతున్నావు. నీ స్వస్వరూపాన్ని నీవు మరచి పోతున్నావు. నీవు ఎవరిమాటలూ వినవద్దు. నీ 'కాన్షస్' ను నీవు అనుసరించు. నీకు మంచి అనిపించిన దానిని అనుసరించు. నేనెప్పుడూ ఎవరిని Force (ఫోర్సు) చేయను. ఎందుకు? నీకు నిజమైన Source (సోర్సు) ఉన్నది. అదియే ఆత్మ సోర్సు. ఫోర్సు అనేది మిలిటరీ ఫోర్సు. సోర్సు అనేది ఆత్మ సోర్సు. అది ప్రేమతో కూడినటువంటిది. ఆ ప్రేమను మీరు అనుసరించండి. కనుక మొదటి ప్రశ్నకు ఈ విధమైన జవాబుగా మీరు తీసుకోండి "నేనే కాపాడుతాను, నేను సత్యాన్ని, మరొకరు సత్యంకాదు" అని ఎప్పుడునూ జీసస్ చెప్పలేదు. అందరూ సత్యస్వరూపులే, అందరూ పవిత్రస్వరూపులే, అందరూ భగవంతుని బిడ్డలే అనేటటువంటి విశాలమైన భావంతో తాను ప్రచారం చేస్తూ వచ్చాడు. "ఒకరినొకరు కొట్టుకో కూడదు, తిట్టుకోకూడదు, హింసించుకోకూడదు, ద్వేషించుకోకూడదు" అనేదే జీసస్ ప్రచారం.

**ఇక రెండవ సందేహం. "స్వామి అనేకమందికి స్వప్నాలలో వస్తుంటాడు, కాని ఆ స్వప్నాలు మాకు ఎందుకు రాకూడదు"** అని ప్రశ్నిస్తున్నారు. ఇదికూడనూ ఒక విధమైనటువంటి అమాయకత్వమే, ఇది కేవలం వారు తలచుకుంటే స్వప్నములో వచ్చేటటువంటిది కాదు. నీవు ఎందరినో తలచుకుంటుంటావు. వారందరూ నీస్వప్నంలో వస్తున్నారా? రావటంలేదు. స్వప్నంలో రాకపోయినంత మాత్రమున స్వామికి మాపైన దయలేదని భావించటం చాలా పొరపాటు. ఈ స్వప్నమనేటటు వంటిది ప్రతిబింబము. ఈ స్వప్నాలను గురించి కొంతచెబుతాను. స్వప్నములు రావటం చాలా మంచిది. కొన్ని చెడ్డవి వస్తుంటాయి, భయంకరమైనవి వస్తుంటాయి, కొన్ని బాధాకరమైనవి వస్తుంటాయి, కొన్ని ఆనందకరమైనవి వస్తుంటాయి. కొన్ని దుఃఖకరమైనటువంటివి కూడా వస్తాయి. ఇవన్నీ రావటం ఎందుకోసం అంటే, నీయొక్క సంకల్పం లోపల ఇవన్నీ అప్పుడప్పుడూ చేరిపోయినాయి. అవన్నీ లోపల 'స్టాక్' అయినాయి. ఈ స్వప్నరూపంలో అవన్నీ బయటపడిపోవటం చాలా మంచిది. ఇవన్నీ నాలో ఉన్నటువంటి Reflection, Reaction, Resound అని నీవు భావించాలి. అయితే స్వామియొక్క స్వప్నం మాత్రం Reflection, Reaction, Resound కాదు. నేను తలచు కున్నప్పుడే మీ కలలో వస్తానుగాని, మీరు తలచు కున్నప్పుడు రాదు. నిన్న ఒక వ్యక్తి వచ్చాడు. నన్ను ఎప్పుడూ చూడనటువంటివాడు. నిన్నటిదినం ఒక మహమ్మదీయుడు ( ఉస్తాద్ ఆలీఖాన్) సంగీత కచేరీ చేశాడు. అతను ఎప్పుడూ నన్ను చూడలేదు. నేను చెప్పాను" బాబూ! నీవు అమెరికా వెళ్ళినప్పుడు అక్కడ కారు యాక్సిడెంటు అయింది. అక్కడే నేను కనిపించాను నీకు తెలుసా?" అన్నాను. 'హో మైగాడ్' అని ఏడ్చినాడు. అదేరోజు రాత్రి స్వప్నంలో "నీవు వచ్చే నాబర్త్‌డేకి పుట్టపర్తికి వస్తున్నావులే" అని చెప్పాను. నిన్నటి దినం వచ్చి అతను ఇక్కడ సంగీత కచేరి చేశాడు. కొంతమందికి స్వప్నాలు వస్తుంటాయి. స్వప్నంలో స్వామి కనిపిస్తూనే ఉంటాడు. తిరిగి నీ భావాలు నీకు కనిపిస్తూనే ఉంటాయి. అవీ ఇవీ రెండూ మిక్స్ అయిపోతుంటాయి. ఇది సరియైనటు వంటిది కాదు. ఇది స్వామి సంకల్పంతో వచ్చినటు వంటిది కాదు. ఆహార దోషం చేత, అజీర్ణ దోషం చేత వచ్చేటటు వంటివి ఇవి. నేను వస్తే క్లియర్‌గా వచ్చేస్తాను, క్లియర్‌గా మాట్లాడిపోతాను. ఒకే స్వప్నంలో కాసేపు పుట్టపర్తిలో ఉన్నట్లు, కాసేపు అమెరికాలో ఉన్నట్లు వస్తుంటాయి. ఒకేదాంట్లో రెండూ మూడుకలసి పోతుంటాయి. ఇది ఎట్లా ఉన్నదంటే, బంగారంలోపల లోహాలు చేరినట్లుగా చేరిపోయింది. కాబట్టి That is not pure, that is not right దేనికోసం వచ్చానో, దానిని స్వప్నంలో సత్యంగా, సరియైన స్వరూపకంగా నీకు కనిపించటమే అది సత్యం. కాని స్వప్నంలో కనిపించకుండా పోయినంతమాత్రమున, నాపైన స్వామికి దయలేదని భావించుకోవటం పొరపాటు. ఉంది...ఉంది...

**ఇక మూడవది. అందరూ సాధనలు చేస్తున్నారు. నేను కూడనూ సాధనలు చేయాలని ఆశపడుతున్నాను. కాని నాకు సమయం చిక్కటం లేదు. నాయొక్క ప్రాపంచిక సంబంధమైన వ్యాపారములయందు, పనుల యందు నేను నిమగ్నుడనైపోయి, స్వామిని సరియైనటు వంటి హృదయంతో నేను చింతించటంలేదు. కాన స్వామి సేవ చేయటానికి నాకు సరియైనటువంటి సమయం చిక్కటం లేదు అన్నాడు.** ఇది చాలా తప్పు. స్వామి సేవ

చేయాలంటే, స్వామి చింతన చేయాలంటే, కాలం ప్రత్యేకంగా కావాలా? ఆఫీసుకు పో! ఆఫీసుకు ఎగకొట్ట నవసరం లేదు. ఆఫీసుకు వెళ్ళి పని చేయి. సక్రమంగా ఆ పనిచేస్తూ కూడ ఇదీ దైవం పనే అని భావించు. అది దైవకార్యమే, అది స్వామి కార్యమే, అదీ దైవ సేవయే. దీనిని పురస్కరించుకొనియే "Work is worship, Duty is God" అన్నాను. కనుక నీవు ప్రత్యేకంగా కూర్చుని సాయిరాం!.. సాయిరాం!.. అని చెప్పనవసరం లేదు. నీవు ఏ పని అయినా చేసుకుంటూ పో. అదంతా దైవ కార్యంగానే భావించు. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' అన్నారు. 'సర్వకర్మ భగవత్ ప్రీత్యార్థమ్' అన్నారు. ఎన్నిపనులు చేస్తున్నా, ఏ పనులు చేస్తున్నా ఇవన్నీ భగవత్ ప్రీత్యార్థం చేస్తున్నానని చేయి. అదే గొప్ప సాధన. ఆదివారం వచ్చింది. ఈ రోజు ప్రత్యేకంగా కూర్చొని ధ్యానం చేయాలని కూర్చుంటారు. Sunday వచ్చింది. ధ్యానంలో కూర్చున్నావు. కాని ఒక్క క్షణమైన నీ మనసు నిలిపావా? ఇటువంటి Meditationను ఎందుకోసం చేయాలి? ఇలాంటి దానికి Time కావాలని ఎందుకు కోరాలి? కాబట్టి నీవు వెళ్ళి నీ ఇంటిపని నీవు చూసుకో. ఏ పని చేసినప్పటికినీ 'సర్వ కర్మ భగవత్ ప్రీత్యార్థమ్' అని భావించుకో. ఎందుకోసమనగా "కర్మాను బంధీని జగత్ లోకే" ప్రతి మానవుడు కర్మచేతనే కూడి ఉంటున్నాడు. కర్మ అనగా ఏమిటి? బజార్లు ఊడ్చడం, జబ్బుచేసినవారికి సేవచేయటం-- అది మాత్రమేకర్మకాదు. దీని అంతరార్థం ఏమిటి? చలనశక్తియే కర్మ. నీయొక్క ఉచ్ఛ్వాస, నిశ్వాసలు కూడ కర్మయే. కనురెప్పలుకొట్టడం కూడా కర్మయే. నిద్రిస్తున్నావు-- అది కూడా కర్మయే. చదువుకుంటున్నావు - అదికూడా కర్మయే. సర్వమూ కర్మయే. కర్మ లేకుండా మానవుడు క్షణమైనా నిలచడానికి వీలుకాదు. సర్వమూ కర్మనే. అయితే భగవత్ ప్రీత్యార్థంగా చేసే కర్మలు సార్థకమవుతాయి. ఇది నాకర్మ, ఇది దైవం కర్మ అని బేధం పెట్టుకోకూడదు. నీవు, దైవం వేరు వేరు అనుకున్నప్పుడు అన్నింటిలోనూ వేరువేరు ఫలితమే వస్తుంది. You and God are not seperate You and God are one. ఆ నమ్మకంతో కర్మలనాచరించాలి. అప్పుడు ఏచిన్న పని చేసినా, అది గొప్పదిగానే మారుతుంది. చిన్నదాని లోపలనే పెద్దది ఉంటుంది. బజారుకు పోయి సేవచేయటం, హాస్పిటల్‌కు పోయి రోగులకు సేవ చేయటం- అది చేయటం తప్పు కాదు. కాని అదియే సేవగా భావించకూడదు. నీ ఆఫీసులో, నీ బిజినెస్‌లో, నీ డ్యూటీలో నీవు సక్రమంగా పనిచేయి. ఆ డ్యూటీయే మనకర్మ, అదియే నిజమైన సాధన. ప్రభుత్వం నుంచి జీతం తీసుకుంటున్నావు. దానికి తగిన పని చేయకుండా ఎగగొట్టి సాధన చేస్తుంటే దోషం కాదా? జీతానికి తగిన కర్మ చేయి. కాబట్టి ఆఫీసులో చేసేది కూడా సేవే. నీ ఆఫీసు పనులు సక్రమంగా నిర్వర్తించడం కూడా కర్మయే. ఏపని అయినా చేయి. - ఇది దైవపని అనే భావంతో చేయి. నాకు సమయం లేదని సాకు చెప్ప కూడదు. 24 గంటలలోపున ఆఫీసులో ఎన్ని గంటలు పనిచేస్తున్నావు? తరువాత ఆరు గంటలు నిద్రపోతున్నావు. మిగతా సమయంలో ఏమి చేస్తున్నావు? ఏవో స్వవిషయాలు చూచుకుంటున్నావు. కావల్సినంత సమయం (Time) ఉంటూనే ఉన్నది. Time లేదని ఎందుకు చెప్పాలి?

ఒక చిన్న కథ. ఒక వ్యక్తి పరమభక్తుడు కావాలని ఆశిస్తూ వచ్చాడు. "స్వామీ! నా యొక్క ఆయుష్షు ఎంతవరకూ యిచ్చారు" అని అడిగాడు. "నాయనా! 80 సంవత్సరాలు యిచ్చాను" అన్నాడు. చాలా సంతోషం. అయితే 20-25 వరకు నా ఆటలు, పాటలు, చదువులతో సరిపోతుంది. 50 సంవత్సరాలకు నా సంసారం, సంతానం, నా బిడ్డలు చూచుకుంటాను. 75-80 సంవత్సరాల వరకు నా భవిష్యత్తుకు ఏర్పాట్లు వగయిరాలు చూచుకుంటాను. ఓ భగవంతుడా! 80 సంవత్సరాల వరకు నా పనులు చూచుకోవటానికే సరిపోయింది. ఇంకా 20 సంవత్సరాలు యివ్వమని కోరాడు. అప్పుడు చెప్పాడు భగవంతుడు "పిచ్చివాడా! నన్ను తలచుకోవటానికి ఇంకా 20 సంవత్సరాలు అధికంగా కావలెనా? 20 సం॥లు అవసరం లేదు. రెండు సెకన్లు చాలు నీకు. ఎట్లా? కరెంటు ఉన్నది. నీకు లైట్ కావాలి. స్విచ్ వేయటానికి నీకు ఎంత సమయం పడుతుంది. సెకను కూడా అవసరం లేదు. స్విచ్ వేయగానే లైట్ వస్తుంది. ఈ లైట్ వేయటానికి నీకు 20 సంవత్సరాలు కావాలా? భగవంతుని హృదయ పూర్వకంగా స్మరించ డానికి నీకు 20 సంవత్సరాలు కావాలా? ఒక వేళ నేను యిస్తే ఈ 20 సంవత్సరములు

కూడా ఇంకా దేనికి ఉపయోగిస్తావో? ఏమో? ఇదంతా సోమరి లక్షణం. నిజంగా భగవంతుని తలచుకోవటానికి ఒక్క క్షణం చాలు. స్థిరమైన చిత్తంతో ఒక్క క్షణం తలచుకున్నా చాలు. Slow and study wins the race. కనుక మనం సమయమును వ్యర్థం చేసుకోకూడదు. Time is God. Don't waste time. Time waste is Life Waste. కాలమును సరీగా ఉపయోగించుకుంటూ రా. అదియే నీ సాధన. ఆ కాలాన్ని భగవత్ స్వరూపకంగా భావించుకో. నీవంతా పవిత్రుడవైపోతావు. కాబట్టి నాకు Time లేదని విచారించనవసరం లేదు. ఈ ప్రశ్న వ్రాసిన వారు ఎవరో గాని అతను పక్కా సోమరిపోతే. కనుక ఆ సోమరి తనాన్ని దూరం చేసుకో. దీనిని దూరం చేసుకుంటే నీవు పవిత్రమైన మార్గాన్ని పొందగలవు. Laziness is rust and dust. Realisation is best and rest. ఈ సత్యమును నీవు చక్కగా గుర్తుంచుకో.

ఇంక నాల్గవ ప్రశ్న? **"మేము విదేశాలలో ఉండటం చేత సాయి సేవలు చేయటానికి అవకాశం చిక్కటం లేదు. కనుక మేము ఇండియాకు వచ్చి, ఇండియాలో వుండి, స్వామి సేవలు హృదయ పూర్వకంగా చేయాలి"** అని ఆశిస్తున్నాము అని వ్రాశాడు. ఇది కూడా ఒక రకమైన సోమరితనమే. సేవ చేయటానికి విదేశం ఏమిటి? స్వదేశం ఏమిటి? భగవంతుడు సర్వాంతర్యామి. అక్కడ చేసినా సేవనే, ఇక్కడ చేసినా సేవనే. ఎక్కడైనా సేవ చేయవచ్చును. అంతేగాని ప్రశాంతి నిలయం వచ్చి, స్వామి దగ్గరే వుంటుండి స్వామి సేవ చేయాలని కోరుకోవటం, ఇది కూడా ఒక స్వార్థమే. ఫారిన్‌లో 'రిటైర్' అయిన తరువాత, అప్పుడు కావాలనుకుంటే ఇక్కడకు వచ్చి చేరండి. పిల్లల విద్యా బుద్ధులుంటాయి. ఇంకా వాళ్ళ బాగోగులను చూడవలసి వుంటుంది. కనుక మీ డ్యూటీని సక్రమంగా అక్కడనే చేయండి. అదంతా వదలి ప్రశాంతి నిలయం వస్తే కొన్ని దినములు బాగా చేయవచ్చును. కాని ఇక్కడకు వచ్చిన తరువాత మళ్ళీ నీ మనస్సు మారవచ్చు. కనుక Don't Come Now. అక్కడనే ఉండి సేవ చేయండి. ఎక్కడ చేసినా సేవ సేవనే. స్వామి ఏ సేవనూ ఆశించటం లేదు. నా యొక్క పనిని నేనే చూసుకుంటున్నాను. ఇంత మంది మా పిల్లలు వుంటున్నారు. ఎవరు చేస్తున్నారు నా సేవ. కాని ఆశిస్తూనే ఉంటారు మీలాగే. కాని ఏ పవిత్రమైనటువంటి వ్యక్తులకో ఈ పవిత్రమైన సేవ చిక్కుతుంది. కాని అందరికీ చిక్కదు. నాకు సేవ చేయనక్కర లేదు. సేవ చేయకుండా పోయినంతమాత్రమున నాకు దూరమయ్యారని నేను భావించను. నేను ఏనాడూ సేవను ఆశించటం లేదు. మీ సేవలు మీరు చేసుకోండి. మీ కర్తవ్యాన్ని మీరు నిర్వర్తించండి. అంతేచాలు. నాకు ఏ సేవా అవసరం లేదు. నాకు 73 సంవత్సరములు. నా అవయవములన్నీ నా వశంలోనే ఉన్నాయి. నా పనులు నేను చేసుకోగలను. కనుక నేను ఇంకొకరి సేవను నేను ఆశించటం లేదు. శక్తి లేని వారికి సేవ చేయండి. అదే స్వామి సేవగా మీరు భావించుకోండి. ఇంత చేటు తిరుగుతుంటారు. పాపం! స్వామికి కాళ్ళనెప్పులేమో! అని మీరు అనుకుంటుంటారు. నాకు కాళ్ళనొప్పులు ఎప్పుడూ రాలేదు. ఎవరిదైనా తీసుకున్నప్పుడు నేను అనుభవిస్తాను గాని, నా స్వత: సిద్ధంగా నాకు ఏ నొప్పులూ లేవు. అంతేగాని ఈ దేహమునకు ఏ బాధలూ లేవు. నేను అప్పుడప్పుడు నవ్వుతూ నా బ్లడ్ ప్రషర్ చూడమని డా॥ అల్రేజర్‌ను అడుగుతుంటాను. స్వామీ Perfect Normal గా ఉన్నదంటాడు. నార్మల్ అంటే 120/80. కాని నాకు 117/78 ఉంది. ఇది Perfect Normal. పల్సు చూస్తే సామాన్యంగా ఆరోగ్యంగా ఉన్నవానికి 70 ఉండాలి. నాకు 68 పల్సు ఉంటుంది. ఇది కూడా Perfect Normal. ఎంతసేపు మాట్లాడినా, ఎంత పనిచేసినా, ఏ పనిచేసినా బ్లడ్ ప్రెషర్ మారదు, పల్సు పెరగదు తరగదు. ఈ శరీరం ఎటువంటి పవిత్రమైనటువంటిది? Purity (పవిత్రత) Patience (సహనం) Perseverance (పట్టుదల) ఈ మూడూ చేరటం వలననే ఈ పవిత్రత వస్తున్నది. కనుక మీరు ఎవరూ నా సేవలు చేయనవసరం లేదు. మీ సేవలు మీరు చేసుకుంటూ, మీ కుటుంబ సంక్షేమాన్ని ఆశించి, దానికి తగిన ప్రయత్నాలు మీరు చేసుకోండి.

ఇంక ఐదవ ప్రశ్న. **'మేము చేసుకొన్నటు వంటి కర్మల ఫలితమనేటటువంటి బాకీలు ఎట్లా తీరుతాయి?'** 'ఇవన్నీ కూడనూ ఒక విధమైన బాకీలుగా భావిస్తున్నారు వారు. కర్మఫలము నివారణ కావాలనుకుంటే, ఎలాంటి కర్మలైనా సరే, తీరరాని కర్మలైనా సరే, కఠినమైన కర్మలైనా సరే, బాధపెట్టే కర్మలైనా సరే - ఒక్క ప్రేమ అనే మందు ద్వారానే నివారణ చేసుకోవచ్చును. ఈ ప్రేమ కంటే మించినటు వంటిది మరొకటి లేదు. హృదయ పూర్వకంగా భగవంతుని ప్రేమించు. నీ సర్వకర్మలూ నివారణ అయిపోతాయి. సర్వరోగములూ నివారణ అయిపోతాయి. కాని అది కాలేదని, దానిని వేరుగా భావించకూడదు. హృదయ పూర్వకంగా ప్రార్థిస్తే తప్పక అవుతుంది. కాని కొంత మంది ప్రార్థిస్తుంటారు. పూజాగదిలో కూచుంటారు. సాయిరాం...సాయిరాం... అని జపం చేస్తూనే ఉంటారు. ఏమిటే! చాకలివాడు గుడ్డలు తెచ్చాడా? చాకలి వాని మీద మనసు పోతుంటుంది. నీవు జపం చేస్తుంటే చాకలి వాని మీద మనసు ఎందుకు పోవాలి? తరువాత కొంత మంది ధ్యానం చేస్తూంటారు. వంట ఇంటిలోని పొగ వస్తుంటుంది. 'వంటమాడి పోతున్నది చూడు'! అంటాడు భార్యతో. ఈ విధమైన సాధనలు చేస్తుంటే ఎట్లా భగవదానుగ్రహం ప్రాప్తిస్తుంది? నీవు చేసే సాధనలు చంచలమైన మనసుతో చేస్తున్నావు. నిశ్చలమైన మనసుతో హృదయ పూర్వకంగా చేయి. తప్పక భగవదానుగ్రహం లభిస్తుంది. ఏ సాధనలైనా చేయి. హృదయపూర్వకంగా ప్రేమించు. ప్రేమతో సర్వరోగములూ నివారణ అయిపోతాయి. సర్వ బాధలు కూడా నివారణ అవుతాయి. సర్వచింతలూ నివారణ అవుతాయి. కనుక మొట్టమొదట నీవు ప్రేమను పెంచుకో! ప్రేమను పెంచుకో!

ప్రేమను ఏ రీతిగా పెంచాలి? భగవంతుడు ప్రేమ స్వరూపుడనుకుంటే, ఆ ప్రేమనే పెరిగిపోతుంది. కాని భగవంతుని ఎన్నో రకములుగా నీవు భావించు కుంటుంటే ప్రేమ ఎట్లా అభివృద్ధి అవుతుంది? ప్రేమనే దీనికి సరియైన ఔషధం. మొక్కను టిన్నులో పెట్టి నీరు పోస్తుంటే ఏమౌతుంది? కొంత కాలానికి కుళ్ళిపోతుంది. ఆ మొక్కను భూమిలో పెట్టి నీరు పోయాలి. భగవత్ రూపాన్ని నామాన్ని ఎక్కడనో పెట్టి పూజ చేస్తే కాదు. హృదయమనేటటువంటి భూమిలో నాటు. 'ప్రేమ' అనే జలం పోయి. తప్పక అభివృద్ధి అవుతుంది. కనుక ప్రత్యేకంగా సాధనలు చేయనవసరం లేదు.

ఇంక ఆరవ ప్రశ్న? ఇది చాలా విచిత్రమైన ప్రశ్న **మా పూజా గదిలో రాముడు, కృష్ణుడు, శివుడు, అల్లా, జీసస్ - అన్ని ఫొటోలు పెట్టుకుంటాం. వీటి మధ్యలో స్వామి ఫొటో కూడా పెట్టుకుంటాం. ఇది సరియైనదా? కాదా?** భగవంతుడు సర్వ స్వరూపుడు అనేటటువంటి విశ్వాసం నీలో ధృడంగా వుంటుంటే ఏ ఫొటో పెట్టుకుంటే భయమేమి? నీవు రాముడ్ని పూజించు, ఈశ్వరుని పూజించు, అల్లాను పూజించు, జీసస్‌ను పూజించు, సాయిని పూజించు. అందరూ ఒక్కటే అనే భావం పెట్టుకో.

ఒక చిన్న ఉదాహరణ. భారతదేశంలో అనేక స్వీట్సు ఉంటున్నాయి. గోధుమ హల్వా, జిలేబి, మైసూర్ పాక్, పంచదార లడ్డు మొదలగునవి అనేకం ఉన్నాయి. వీటన్నిటికీ రూప నామములు వేరు వేరు గాని, అన్నిటి యందు ఉన్నటువంటి పంచదార ఒక్కటే. అదే విధంగా నీవు ఎవరిని పూజించినా అందరియందున్నటు వంటి దివ్యత్వం ఒక్కటే. All are one అనే భావం నీలో పెట్టుకున్నప్పుడు ఈ బేధము నిన్ను బాధించదు. ఒక వేళ నీకు ఇన్ని ఫొటోలు పెట్టుకోవటం ఇష్టం లేకపోతే, నీకు ఇష్టమైనదే పెట్టుకో. ఒక వేళ సాయిబాబా ఫొటో ఇష్టం లేకపోతే సాయిబాబా ఫొటో తీసివేయి. తప్పులేదు. ఒక వేళ రాముడి ఫొటో ఇష్టం లేకపోతే రాముడి ఫొటో తీసివేయి. ఈ ఫొటోలు తీయటం వలన వచ్చే ఫలితం కాదు ఇది.

నేను అప్పుడప్పుడు మా పిల్లలకు చెబు తుంటాను. ఒక పిల్లవాడు పరీక్షలు వ్రాయటానికి వెళ్ళు తున్నాడు. అతను లెక్కలలో చాలా వెనుకబడి ఉన్నాడు. స్వామిని పూజచేసి లెక్కల పరీక్షకు వెళ్ళాడు. ఆ దినం సరిగా వ్రాయలేదు. ఇంటికి వచ్చి స్వామి ఫొటోను తీసి కప్‌బోర్డులో పెట్టాడు. రెండవ దినం సెకండ్ పేపర్ మ్యాథ్స్. ఆనాడు రాముడి ఫొటో పెట్టి పూజ చేసి పరీక్షకు వెళ్ళాడు. ఆనాడు కూడా పరీక్ష సరిగా వ్రాయలేదు. ఇంటికి వచ్చి రాముడి ఫొటో తీసి కప్‌బోర్డులో పెట్టాడు. మూడవరోజు

అకౌంట్స్ పేపరు. ఆనాడు దేవి ఫొటోను పూజ చేసి పరీక్షకు వెళ్ళాడు. ఆనాడు అసలే వ్రాయలేక పోయాడు. కోపంతో ఇంటికి వచ్చి ఆ ఫొటో తీసి కప్‌బోర్డులో పెట్టాడు. నాల్గవరోజు పరీక్షకు వెళ్ళే ముందు విఘ్నేశ్వరుని ఫొటో పెట్టి ఊదువత్తులు వెలిగించాడు. ఆ ఊదువత్తుల పొగ కప్‌బోర్డులోనికి పోనారంభించింది. కోపం వచ్చింది. నేను వినాయకుని పూజ కోసం ఈ ఊదు వత్తులు పెడుతే నాకు ఏమాత్రం సహాయం చేయనటువంటి ఈ రాముడికి, ఈ సాయిబాబాకు ఈ అగరు వత్తులు పొగ ఎందుకు వెళ్ళాలి? అని లోపలికి వెళ్ళి ఒక వస్త్రం తీసుకొని వచ్చి చించి సాయిబాబా ముక్కుకు, శ్రీరాముని ముక్కుకు, దేవి ముక్కుకు అడ్డంగా కట్టివేశాడు. తక్షణమే సాయి బాబా, శ్రీరాముడు, దేవి ప్రత్యక్షమైనారు. అతనికి ఆశ్చర్యం వేసింది. పూజించిన రోజున ప్రత్యక్షం కాలేదు. శిక్షించిన రోజున ప్రత్యక్షమైనారే? అని చూస్తున్నాడు. అప్పుడు సాయిబాబా "బాబూ! ఇంతకాలం నేను ఫొటో రూపంలో ఉన్నాననుకున్నావు. అయితే ఈనాడు సాయి బాబా జీవంతో ఉన్నాడని భావించి, ముక్కుకు ఈ అగరు వత్తుల పొగ చేరకూడదని భావించి ముక్కుకు అడ్డంగా గుడ్డ కట్టావు అప్పుడు నేను చెప్పాను. "You may worship a picture as a God, But not God as a picture" అన్నాను. ఈనాడు నీవు ఆ ఫొటోను ఒక బొమ్మగా తీసుకోలేదు, సాక్షాత్ ఆ బొమ్మను దేవుడుగా భావించి ఆ ముక్కుకు గుడ్డ కట్టివేశావు. కనుక ఈనాడు సహజంగా మన పూజలు ఫొటోకు చేస్తున్నాం. అది ఫొటోగా తీసుకోకూడదు, సాక్షాత్ దివ్యత్వానికి చేస్తున్నామనే భావన నీలో ఉన్నప్పుడు, నీ అభీష్టం నేరవేరుతుంది. ఈనాడు మానవులు అనేకమంది పిక్చర్‌ను పిక్చర్‌గా తీసు కుంటున్నారు. ఆ పిక్చర్‌లోనుంచి మిక్చర్ అయిపోతు న్నారు. మిక్చర్ నుండి లెక్చర్ చెబుతున్నారు. నీ చదివే టటువంటి చదువునంతా కేవలం ఈ మస్తకమును నింపుకోవద్దు. పుస్తకమునంతా మస్తకంలో చేర్చవద్దు. మస్తకమును పుస్తకంలో చేర్చు. అప్పుడు నీవు తప్పక పాస్ కాగలవు. కనుక ఏ రూపం పెట్టుకొన్నా, ఏ నామం ఉచ్చరించినా - అన్ని రూపనామాలు ఒక్క దైవత్వమే అనేటటువంటి సత్యాన్ని గుర్తించుకో. అందరూ దైవ స్వరూపులే. ఎవరూ వద్దనుకుంటే, నీ తల్లిదండ్రులనే పూజించు. అదికూడా దైవస్వరూపమే. అందువలననే మాతృదేవోభవ! పితృదేవోభవ! ఆచార్య దేవో భవ! అతిథి దేవో భవ! అన్నారు. అలాంటి పరిస్థితులలో ఈ దైవమే, ఆ దైవమే అనే సందేహం ఎందుకు రావాలి? దైవంపై ఏమాత్రం అనుమానాలకు అవకాశం యివ్వకు. God is God అంతే గాని రూపనామములపై నీవు విమర్శనలు చేయవద్దు. కనుక ఏ ఫొటోనయినా పెట్టుకో. ఏ నామమైనా తలచుకో. ఈ సత్యమును నీ హృదయంలో పెట్టుకో. "ఏకం సత్ విప్రా బహుదా వదంతి." బేధాలు పెట్టుకొని ఫొటోలు మార్చకండి. మీకు ఏది ఇష్టమో దానిని చేసుకోండి. అదే నిజమైన మార్గం.

ఇక ఏడవ ప్రశ్న. ప్రాపంచిక సంబంధమైన సాధనల లోపల ఏవిధమైన సాధన స్వామికి తృప్తికరంగా ఉంటుంది? మేము చేసే సాధన స్వామిని సంతృప్తి పరచాలి. ఏ విధమైన సాధన చేస్తే స్వామికి సంతృప్తి? దీనికి సమాధానం ఒకటే. నాకు ఏదీ అవసరం లేదు. సర్వమానవులనూ దైవ స్వరూపకంగానే నీవు విశ్వసించు. అందరియందూ దైవత్వం ఉన్నదని విశ్వసించు. అది నాకు చాలా ప్రేమ, అది నాకు చాలా ఇష్టం. ఏది నీకు చేస్తే ఆనందం అనిపిస్తుందో, దానిని ఇతరులకు నీవు చేయి. నీకు ఏది ఇష్టమో, ఆ ఇష్టమైన దానిని ఇతరులకు చేయి. అనేక పర్యాయములు చెబుతుంటాను. Help Ever, Hurt Never. అది నాకు ప్రీతి. అందరికీ సహాయం చేస్తూ రా! ఎవరికీ హాని చేయకు. ఎవరినీ బాధపెట్టవద్దు. ఇతరులపైన దుర్భావనలు పెంచుకోవద్దు. నీ ద్వేషిని కూడా ప్రేమించు. అదియే స్వామి యొక్క ప్రధాన లక్ష్యం. ఎంతమందో లోకంలో ఉంటున్నారు. అందరూ స్వామిని పూజించేవారు కాదు. ఒక ప్రక్కన పూజిస్తూ, మరో ప్రక్కన దూషించే వారు కూడా ఉంటున్నారు. ఈ రెండింటినీ నేను చూడను. నేను అందరినీ ప్రేమిస్తూనే ఉంటాను. వారి వారి ప్రేమ వారిదే. వారి వారి జబ్బు వారిదే. వారి వారి రోగం వారిదే. ఎవరి ఖర్మ వారిదే. వారు చేసినటు వంటిదివారే అనుభవిస్తారు గాని, నావరకు రాదు.

ఎవరు చేసిన కర్మ వారనుభవించక తప్పదన్నా
ఏనాడు ఏ తీరు ఎవరు చెప్పగలరు అనుభవించుట సిద్ధమన్నా!
రాముడంతటివాడు రమణి సీతను బాసి పామరునివలె ఏడ్చెనన్నా
అలనాటి పాండవులు ఆకులలములు మేసి
అడవి పాలైపోయారన్నా
ఏనాడు ఏ తీరు ఎవరు చెప్పగలరు అనుభవించుట సిద్ధమన్నా!

నీవు మంచి చేస్తే నీకు మంచే కలుగుతుంది. నీవు చెడ్డ చేస్తే, నీకు చెడే కలుగుతుంది. దీనిని మొట్ట మొదట నీవు గ్రహించి తదనుగుణంగా ప్రవర్తించు. నేను ఎవ్వరినీ ద్వేషించను, అనుమానించను. నన్ను నమ్మని వారిని కూడా నేను నమ్ముతుంటాను. అదే నా సహజం. అందరూ ఆనందంగా ఉండాలని నా ఆశ. అందరూ నాకు ఒకటే. అదే నేను ఆశిస్తున్నాను. అయితే మీ మీ శక్తిని బట్టి అది మారిపోతుంటుంది. మంచి చెడ్డలు మీలో ఉన్నాయి గాని నాలో లేవు. నాలో లేవు. రావు. నేను ఎప్పుడూ "లోకాస్సమస్తా సుఖినో భవంతు'' అందరూ క్షేమంగా వుండాలని నా అభిప్రాయం. నన్ను మీరు ద్వేషించినా, మిమ్ములను నేను ప్రేమిస్తాను. అదియే నా సహజం. అదియే నా Divine Quality. మీరు ఈనాడు దూషిస్తారు, రేపు ప్రేమిస్తారు, మరల ద్వేషిస్తారు. ఇదంతా Deep Wine లక్షణం. అనగా త్రాగనప్పుడు ఒక రకంగా మాట్లాడుతాడు, త్రాగినప్పుడు మరొక రకంగా మాట్లాడుతాడు. ఈ ప్రాపంచిక కోరికల్లో మునగటం చేతనే, నీ మనసు ఒక తూరి అటు, ఒక తూరి ఇటు పోతుంటుంది. కాని పరిపూర్ణ ప్రేమ కలిగినటువంటి వాడు ఎప్పుడూ ఒక మాదిరిగానే ఉంటాడు. వాడు నన్ను మరచినా, నేను మాత్రం వాడిని మరవను. నేనెప్పుడూ వాడి వెంట, ఇంట, కంట, జంటనే ఉంటుంటాను. అలాంటి వారు ఎంతో అదృష్టవంతులు. ఎన్ని జన్మల పుణ్య ఫలమో వారిది. అది ఈ జన్మది కాదు. ఎన్నో జన్మల యొక్క ఫలితమే దీనికి మూలకారణం. స్వామికి ఏది ప్రీతి? స్వామికి ఏది అయిష్టము? దీనిని గురించి ఏమాత్రం జంకనవసరం లేదు. మీరు హృదయ పూర్వకంగా ఏది చేసినా, అది నాకు యిష్టమే. మీ హృదయ పవిత్రతే నాకు కావాలి. ఆ విధమైన ప్రేమతో మీరు ఏ సేవలనైనా చేయండి. అయితే పరిపూర్ణమైన విశ్వాసమే గనుక స్వామిపైన ఉండి ఉంటే స్వామి ఆజ్ఞలను శిరసావహించి చేయండి. నేను ఎప్పుడూ, ఎవరికి చెడ్డ చెప్పను. ఏది చెప్పినా అది మీ మంచి కోసమే, నా కోసం కాదు. నాకు పనులనేటటు వంటివి ఒక్కటీ లేదు. అంతా మీ పనులే. తెల్లవారి మొదలు రాత్రి వరకు మీ పనులే నేను చేస్తుంటాను. కనుక మీ ప్రేమలేదని భావించకండి. కాని అదృష్ట వంతులకు మాత్రమే ఈ పవిత్రమైన సేవలు చిక్కుతుంటాయి. చిక్కనటువంటివారు, చిక్కిన వారిని చూచి అసూయ చెందకండి. అసూయకు మించిన జబ్బు వేరొకటి లేదు. కేన్సర్ నయినా కాన్సిల్ చేయవచ్చును గాని అసూయకు మాత్రం మందులేదు.

**ప్రేమస్వరూపులారా!**

సాయిసంస్థల వారందరూ విశాలమైన హృదయాన్ని పెంచుకొని, అసూయలకు అవకాశం యివ్వకుండా, అహంకారానికి తావివ్వకుండా, అందర్నీ సోదర సోదరీమణులుగా భావించుకొని, ఆనందంగా సేవలు చేయండి. విద్య చాలా అత్యవసరమైనటువంటిది. ఇది దొంగలకు చిక్కేటటువంటిది కాదు, అగ్నికి కాలేటటువంటిది కాదు. దీనిని ఎవరూ పంచు కోలేరు. ఎప్పుడూ విద్య విద్యగానే పెరుగుతుంటుంది. ఇట్టి విద్యను జగత్తుకు అందించండి. పిల్లలకు సద్గుణము లను బోధించండి. ధనం కోసం కాదు చదివేది. కలిమి, బలిమి, చెలిమి - ఇవి లోకములో లౌకికమైనటువంటివి. కలిమి - ఈనాడు ధనము ఉండవచ్చును, రేపు పోవచ్చును. బలం - ఈనాడు మంచి బలంగా నీవు వుండవచ్చును. రేపు నీవు చిక్కిపోవచ్చును. ఇక చెలిమి - ఈ నాడు నీ స్నేహితుడు, రేపు శత్రువు కావచ్చును. కాని గుణం మాత్రం ఎప్పటికీ పోదు. ఆ పోనటువంటి శాశ్వతమైన గుణాన్ని మీరు పెంచుకోండి. కనుక పవిత్రమైన గుణాన్ని అభివృద్ధి పరచుకోండి. ఆ గుణం చేత సమాజంలో ప్రవేశించండి. సర్వులకూ సహాయం చేయండి. ఈ హస్తములు తినటానికి కాదు దేవుడు మనకు యిచ్చింది. పరోపకారం చేయటానికి మనకు చేతులను యిచ్చాడు. మనకు కంఠము నిచ్చింది, పరులను దూషించడానికి కాదు,

సినిమా పాటలు పాడటానికి కాదు, దైవ నామాన్ని స్మరించడానికి యిచ్చాడు. కనుక ఆ పవిత్రమైన నామంతో మీ కంఠమును సద్వినియోగం చేసుకోండి. ఇకపోతే తెలివి తేటలను యిచ్చింది అహంకార పడటానికి కాదు, దైవత్వాన్ని ఏ రీతిగా పొందాలి? ఏరీతిగా చింతన చేయాలి? ఏ రీతిగా అనుభవించాలి? అనేటటువంటి దానిని చింతించటానికి మనకు భగవంతుడు తెలివి తేటలను ప్రసాదించాడు. కనుక మనకు భగవంతుడు ప్రసాదించిన ప్రతి అంగమును పవిత్రమైన కర్మలలో ప్రవేశపెట్టాలి.

ఈనాడు ఇక్కడకు 180 దేశాల ప్రతినిధులు విచ్చేశారు. ముఖ్యంగా ఆయా దేశాలకు చెందిన సత్యసాయి సమితుల అధ్యక్షులు మాత్రమే వచ్చారు. ముఖ్యంగా ఆఫీసు బేరర్సు చక్కగా ప్రవర్తించాలి. ఒక్క ఆఫీసు బేరర్ చెడిపోతే అనేకమంది చెడిపోతారు. కనుక నీవు Be Good, Do Good, See Good. అప్పుడు అందరూ ఆదర్శవంతముగా ఉంటారు. మీరు ఒకటి రెండునైనా ఆచరణలో పెట్టి చూపించండి. మీరు ఆదర్శమూర్తులై, సత్యసాయి సంస్థలకు మంచి పేరు తెచ్చి, యావత్ ప్రపంచమును బాగు చేయండి. నా పేరు కోసం నేను ఆశించటం లేదు. నాకు ఏ పేరు ప్రతిష్ఠలు అవసరం లేదు. నేను యింకా ఆశించటం లేదు కానీ నేను ఆశించుతే ప్రపంచ మంతా ఒక్కతూరి ఇక్కడ వాలి పోతుంది. అయితే 'I do not want'. నా సహాయమును తీసుకోండి. ఇతరులకు సహాయం చేయాలనే భావనను పెంచుకోండి.

నాకు ఏమీ అవసరం లేదు. ఎప్పుడూ యివ్వటమే గాని పుచ్చుకోవటం లేదు. అయితే ఒక్కటి మాత్రమే తీసుకుంటాను. ఒకటి మాత్రమే అడుగుతాను. అదే ప్రేమ... ప్రేమ.... నాకు ఏమీ వద్దు. నేను దేనినీ ఆశించను. మీరు ఏమి కోరినా నేను యిస్తాను. ఎన్ని కోరినా యిస్తాను. నేను మాత్రం ఆశించేది ఒక్కటే అదే ప్రేమ... ప్రేమ.... కనుక ఈ ప్రేమను యిచ్చుకొని సర్వమునూ పుచ్చుకోండి. బేధాలు లేకుండా, అసూయ చెందకుండా, అన్నదమ్ముల వలె మెలగండి. ఇంతకంటే ఆనందం మరొకటి లేదు. కాబట్టి Happiness lies in union with God. ఈ భగవత్ భావంతో కూడి పనిచేయండి. అదే నిజమైన ఆనందం. భౌతికమైన విషయాలలో నిజమైన ఆనందం లేదు. అందరూ కలిసి మెలిసి వుంటే నేను నిజంగా ఆనందిస్తాను. ప్రేమతో జీవించండి, ప్రేమలో జీవించండి. అదియే నిజమైన తపస్సు, అదియే నిజమైన ధ్యానము, అదియే నిజమైన జపము, అదియే నిజమైన సాధన. ప్రేమను యిచ్చి ప్రేమను పుచ్చుకోండి. ఈ విధంగా అభివృద్ధి చేస్తే ప్రపంచమంతా ఆనందమయమౌతుంది. ఏ యుగంలో లేని ఆనందాన్ని ఈ యుగంలో మనం అందుకోవచ్చు. నవ్వుతూ మాట్లాడండి. ప్రేమతో పలుకరించండి. హృదయ పూర్వకంగా మాట్లాడండి. మీరు ఆనందంగా ఉండండి. ఇతరులను ఆనంద పరచండి. "Happy Mood, Happy Face, Happy Talk, and Happy Work" ఇదే నేడు కావాలి.

ఐకమత్యాన్ని అభివృద్ధి పరచుకోండి. 'ఐకమత్యమే మహాబలం'. ఐకమత్యం ఉంటే ఏ దేశమైనా అభివృద్ధి చెందుతుంది. గత మూడు రోజులుగా మీరు అనేక చర్చలు జరిపారు. ఇది ఒక పెద్ద Work Shop లాంటిది. ఈ కార్లు అనే దేహాలతో యిక్కడకు వచ్చారు. బోల్టు, నట్సు, బ్రేక్స్, అన్నీ చెడిపోయినాయి. ఈ Work Shop లో అన్నీ సరిచేసుకొని పోండి. మీకార్లకు పెయింట్ కూడా వేసుకొని తీసుకొని పోండి. మిమ్ములను చూచి మీ స్నేహితులు ఆశ్చర్యం చెందాలి. పుట్టపర్తి వెళ్ళి వచ్చిన తరువాత వీడిలో ఎంత మార్పు వచ్చిందిరా! అనేట్లుగా మీ ప్రవర్తన ఉండాలి. ఆ ఆశ్చర్యాన్ని మీరు కల్పించాలి. ఆ ఆనందాన్ని జగత్తుకు అందించాలి. ప్రేమతో నేను చెబుతున్నాను. మీరు బాగుపడాలి. ఇతరులను బాగుపర్చాలి. ఇదే నా ఆకాంక్ష.

*(పుట్టపర్తిలో జరిగిన ప్రథమ Overseas Convention (అంతర్జాతీయ సభ)లో భగవాన్ సాయి చేసిన సుదీర్ఘ దివ్య ప్రసంగము నుండి)*

మంచి అవకాశము



87215
S.T.D. 08555

# శ్రీ సాయిహరి రియల్ ఎస్టేట్స్

## పుట్టపర్తి





మీకు పుట్టపర్తి యందు ప్లాట్లు ఇండ్ల స్థలాలు
కావలసినవారు, అమ్మదలచినవారు
ఈ క్రింది అడ్రసుకు సంప్రదించవలెనని కోరడమైనది.

1. సూపర్ స్పెషాలిటి హాస్పిటల్ ఎదురుగా గల ప్లాట్లు.
2. గోకులం పోస్టాఫీస్ ఎదురుగా గల ప్లాట్లు.
3. M.R.O. ఆఫీసు ఎదురుగా గల ప్లాట్లు.
4. బీడుపల్లికి పోవు బస్సు రోడ్డుకు గల ప్లాట్లు.
5. అపార్ట్‌మెంట్స్ కావలసినవారు.
6. ప్రశాంతి నిలయము దగ్గరలో గల ప్లాట్లు.

**ప్రతినెలా 10వ తేదీన వాసవీ నివాస్ నందు డ్రా తీయబడును.**

క్రొత్తగా ప్రవేశపెట్టిన స్కీములో చేరండి 20X40 రెండు సెంట్లకు
నెలకు రు. 600-00. 36 నెలలు. "మారుతీ కారు బంపర్ డ్రా"





ఇట్లు
శ్రీ సాయి హరి రియల్ ఎస్టేట్స్
**ప్రొ॥ పి. సిద్దయ్య శెట్టి**
ఆర్యవైశ్య సంఘము వైస్ ప్రెసిడెంట్
ఆర్యవైశ్య సత్రం ఫ్రంట్ రూమ్, పుట్టపర్తి.